*Photo by:* **SAMBHU MUKHERJEE**



CHARMER

భలే... భలే...
గాబ్లిన్స్
వచ్చేశాయ్!!




సరికొత్త
గాబ్లిన్స్
ఫ్రూట్ టాఫీలు
ఎంతో సేపు మజా మజాగా...
తినండి ఖుషీ ఖుషీగా

గాబ్లిన్స్ ఫ్రూట్ టాఫీలు నిమ్మ, అనాస, రాస్ప్‌బెర్రీ
మరియు నారింజ రుచులలో లభిస్తాయి.




everest/734/PP-tl

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేదీ లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతె మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 600 026

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ప్రపంచంలో కొందరు స్వార్థపరులు ఉంటారు. నిస్వార్థపరుల ద్వారా వారి స్వార్థం కొనసాగుతుంది. ఇద్దరు స్వార్థపరుల మధ్యనే ఎప్పుడూ ఘర్షణ వస్తుంది. స్వార్థపరులకూ, నిస్వార్థపరులకూ మధ్య ఘర్షణ రాదు. ఈ నెల బేతాళ కథలో ఇదే మనకు కనిపిస్తుంది. అయితే స్వార్థపరులు ఎలా శిక్ష పొందుతారో, ''అసలుకే మోసం'', ''చలించని మనస్సు'' కథలు తెలుపుతాయి.

సంపుటి 56 జూన్ '75 సంచిక 6







# శిథిలాలయం

## 24

వధువు ఈ కథ చెప్పి, "అందుచేత విధిని ఎవరూ తప్పించలేరు. నేను ఈ పామును పెళ్ళాడకపోతే నా తండ్రికి నూరు మంది కన్యలను చంపిన పాపం చుట్టుకుంటుంది," అన్నది.

ఆమె పామును వైభవంగా పెళ్లాడి, అత్తగారి ఇంటనే వుంటూ భర్తసేవ శ్రద్ధగా చెయ్యసాగింది.

ఒకరాత్రి ఆ పాము తాను ఉండే తట్టలో నుంచి వచ్చి, దివ్యసుందరమైన మానవరూపంలో తన భార్య పక్క మీద కూర్చున్నాడు. ఇది చూసి, ఆమె నిర్ఘాంతపోయి, అతను ఎవరో పరపురుషుడు అనుకుని, తలుపులు తెరిచి బయటికి పారిపోబోయింది.

"ప్రేయసీ, వెళ్లకు. నేను నీ భర్తను," అన్నాడు అతను.

ఆమెకు నమ్మకం కలగటం కోసం అతను తట్టలో నిర్జీవంగా పడి ఉన్న పాము శరీరంలో ప్రవేశించి కదలాడి, మనిషి రూపంలో ఇవతలికి వచ్చాడు.

తన భర్త మనిషి అయినందుకు ఆమె ఎంతో సంతోషించి, అతని నెత్తిన కిరీటమూ, శరీరం మీద ఆభరణాలూ చూస్తూ, అతనికి నమస్కారం చేసింది.

వాళ్ళు పడుకుని నిద్రపోయినాక, తన అల్లుడు మనిషైనన్న సంగతి కనిపెట్టిన దేవశర్మ తట్ట నుంచి పాముశరీరాన్ని తీసుకుపోయి తగలబెట్టేశాడు.

కథ పూర్తి చేసి బలభద్రుడు, "మనం మఠంతోబాటు ఈ మహాత్ముడి శరీరాన్ని తగలబెట్టేశామంటే ఆయన ఎల్లప్పుడూ దేవశరీరంలోనే ఉండిపోతారు, మహారాజా!" అన్నాడు.

అట్ట చివరి బొమ్మ

రాజు అనుమతించాడు. బలభద్రుడు మఠాన్ని తగల బెట్టించాడు. కపటసన్యాసి అందులో కాలిపోయాడు.

ఇలా చెప్పి కరటకం, "కనక ప్రమాద కరమైన నీ కుట్ర కట్టిపెట్టు," అన్నది.

దానికి దమనకం, "అది అర్థం లేని మాట! నువు చెప్పే కోటి సిద్ధాంతాలు కూడా నా ఆచరణ విలవ చెయ్యవు. అంత దాకా దేనికి రా, అబ్బి? ఈ ఎద్దు శరీరం మీదనే మనం ఎన్నో నెలలపాటు బతకవచ్చు. దాని కళేబరం ఇప్పుడే నాకళ్ల ముందు స్పష్టంగా మెదులుతున్నది. కాని, యుక్తిగల నక్కలాగా, ఎత్తు పారిన దాకా ఈ విషయం రహస్యంగా ఉంచు," అన్నది.

"ఏమిటా కథ?" అని కరటకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

### యుక్తిగల నక్క

ఒక అరణ్యంలో వజ్రదంష్ట్రం అనే సింహం ఉండేది. దానికి ముగ్గురు మంత్రులుండేవాళ్ళు—చమరకం అనే నక్కా, ఒక తోడేలూ, ఒక ఒంటే.

ఒకనాడు సింహం ఒక మగ ఏనుగుతో ఘోరంగా పోరాడి తీవ్రంగా గాయపడింది. అటు తరవాత అది తన గుహలో బాధ తోనూ, అకలితోనూ అలమటిస్తూ పడి



ఉండి, వేటాడలేక పోయింది. ఆ స్థితిలో అది తన మంత్రులను పిలిచి, "అకలితో చచ్చిపోతున్నాను. ఏ జంతువునైనా వేటాడి తీసుకురండి," అన్నది.

అయితే ఎంత గాలించినా వాటికి ఏ జంతువూ చిక్కలేదు.

అప్పుడు చమరకం అనే నక్క తనలో, "ఈ ఒంటెను చంపినట్టయితే మేమందరమూ కొద్ది రోజులపాటు కడుపు నిండా తినవచ్చు. అయితే అది మిత్రుడూ, మంత్రీ, కావటం చేత సింహం దాన్ని చంపటానికి ఒప్పుకోదు. అందుచేత, ఒంటె చావటానికి ఒప్పుకునేటట్టు నేనే ఒక యుక్తి పన్నుతాను," అనుకున్నది.

అది ఒంటెతో, "మిత్రమా, మన యజమాని తిండి లేక చచ్చిపోతున్నాడు. యజమాని చస్తే మన చావూ తప్పదు. అందుచేత, నీకూ, మన యజమానికీ కూడా లాభించే విధంగా ఒక సూచన చేస్తాను," అన్నది.

"తప్పకుండా చెప్పు. నువు చెప్పినట్టు చేస్తాను. యజమానికి సహాయపడటం పుణ్యం కూడానూ," అన్నది ఒంటె.

"బాబూ, నువు నీ దేహాన్ని నూటికి నూరు వడ్డీ మీద మన యజమానికి ఇచ్చెయ్యి. చచ్చిపోయిన అనంతరం నీకు రెట్టింపు జవసత్వాలు గల జన్మ లభిస్తుంది," అన్నది నక్క.

"మృత్యుదేవత ఈ ఏర్పాటుకు ఒప్పుకుంటే నాకేమీ అభ్యంతరం లేదు," అన్నది ఒంటె.

నక్క సింహం వద్దకు వెళ్ళి, ఎంత వెతికినా తమకు జంతువేదీ దొరకలేదని చెప్పింది. సింహం కుంగిపోయింది. అప్పుడు నక్క ఇలా అన్నది:

"అయితే ఒక మంచి కబురు కూడా చెబుతాను. మన మిత్రుడు ఒంటె తన శరీరాన్ని మీకు ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నది. అయితే, అతగాడి శరీరాన్ని నూరు శాతం వడ్డీతో సహా తిరిగి ఇస్తానని మృత్యుదేవత సాక్షిగా హామీ ఇయ్యాలి."

ఇందుకు సింహం ఒప్పుకుని, ఒంటె ఔదార్యానికి ధన్యవాదాలు తెలుపుకున్నది. తరవాత అది మృత్యుదేవతను సాక్ష్యం ఉండమని, కోరిన ప్రకారం వాగ్దానంచేసి, ఒంటెను చంపింది. నక్కా, తోడేలూ ఒంటె శరీరాన్ని చీల్చి, తినటానికి వీలుగా అమర్చాయి. అయితే నక్క ఉద్దేశం ఆ ఒంటె కళేబరమంతా తనకే దక్కాలని. అందుకు అదొక యుక్తి పన్నింది.

సింహం శరీరం నిండా రక్తపు మరకలుండటం చూసి నక్క, "మీరు నదికి వెళ్ళి చక్కగా స్నానం చేసి రండి. అంతదాకా నేను ఒంటె కళేబరాన్ని చూస్తూ ఉంటాను," అన్నది.





# పక్షి కన్యలు

## 12

[కాపలా రాక్షసుడు సుకేశిని మాటలునమ్మి, కొలను ఒడ్డున జరిగే ఆటపాటలను చూసి వినోదించేందుకు, రోజూ అక్కడికి పోసాగాడు. ఆ సమయంలో సుభాషిణి, శిలాప్రతిమలుగా మారిన కవలసోదరుల పైన మంత్రజలం చల్లి, వాళ్ళకు తిరిగి మామూలు రూపాలు వచ్చేలా చేసింది. అందరూ కలిసి కొలను చేరుకున్నారు. తరవాత—]

రాక్షసుడిని మోసం చేసి కవలసోదరులు ఎలాగో బైటపడ్డారే గాని, వాళ్ళకు మన స్థిమితం లేకుండా పోయింది. ఎందుచేత నంటే, అదివరకు మోస్తరుగా రాక్షసుడి కంట బడకుండా తమను అదృశ్యం చేసుకోగల భస్మం కాస్తా పోయిందాయె! పోనీ రాకుమార్తెలతో పాటు హంసల రూపంలో ఉందామా అంటే, హంసల లెక్క రాక్షసుడికి తెలియనే తెలుసు. కనుక అదీ ప్రయోజనం లేదు. వాళ్ళకు ఏమిచెయ్యటానికీ పాలుపోలేదు.

ఇలాంటి చిక్కులోపడి కవలసోదరులు క్షణ మొక యుగంగా గడపవలసి వచ్చింది.

ఒకరోజున సుభాషిణి, కవలసోదరులతో, "ఇక మీదట మీరు యిక్కడ వుండటం క్షేమం కాదు. మనం చేసిన మోసానికి రాక్షసుడు కసి పూని వుంటాడు.



ఈ సారి వాడి చేతిలో చిక్కితే మటుకు ప్రాణాలతో వదలడు. కనుక రేపు వాడు ఆటపాటలకు వచ్చిన సమయం చూచి, మీరు యీ స్థలం వదిలి వెళ్ళిపొండి. మమ్మల్ని రక్షించే సమస్య ఇంక వదులుకోండి,'' అన్నది.

ఇది విని ఉదయనుడు, ''అలా ఎన్నడూ జరగదు. మా ప్రాణాలు వున్నంత వరకూ మిమ్మల్ని రక్షించేందుకే ప్రయత్నిస్తాం,'' అన్నాడు.

''అలా అయితే, ఒక్కటే మార్గం. రేపు వాడు యిక్కడికి వచ్చినప్పుడు, మాతో పాటు కొలనులో వుండే తక్కిన రాకుమారులు కూడా కలిసి ఆట పాటలలో పాల్గొనేటట్టు ఏర్పాటు చేస్తాను. ఆ రాకుమారులలో మీరూ చేరిపొండి. సమయం కనిపెట్టి రాక్షసుడి తల తెగవేయండి,'' అన్నది సుభాషిణి.

సోదరులు యిందుకు ఒప్పుకున్నారు. మర్నాడు రాక్షసుడు, రాజకుమార్తెల దగ్గిరికి వచ్చినప్పుడు సుభాషిణి, ''మగవాడవైన నీవు ఒక్కడివే యింత మంది ఆడవాళ్ళ మధ్య వుండటం బాగుండదు. కొలనులో యింకా రాకుమార్లు వున్నారు కదా? వాళ్ళని కూడా మనతో చేర్చుకొందాం. సందడిగా వుంటుంది. లోకానికి విరుద్ధమనిపించదు,'' అని సలహా యిచ్చింది.

''ఈ పాటి దానికి నన్ను అడగాలా? అలాగే కానివ్వండి,'' అన్నాడు రాక్షసుడు.

వెంటనే కొలనులో వున్న హంసలన్నీ ఒడ్డుకి వచ్చి, మానవాకారాలు దాల్చినై. వాటిలో కవలసోదరులు కూడా వున్నారు. అయితే ఆట పాటల దృష్టిలో వున్న రాక్షసుడు వాళ్ళని గమనించనే లేదు.

రాకుమార్తెలు కనుపండువుగా నృత్యం చేస్తున్నారు. రాక్షసుడు ఆనందంలో మునిగి తేలుతున్న సమయం చూశాడు, ఉదయనుడు. సర్రున కత్తి దూసి ఒక్క వేటున వాని తల తెగ నరికాడు. వెంటనే రాక్షసుని మొండెం నేలకు

ఒరిగిపోయింది. తెగిపోయిన తల వెళ్ళి కొలను నీటిలో పడింది.

అదే సమయాన మరొక చిత్రం జరిగింది. రాక్షసుడు ఎప్పుడైతే చచ్చిపోయాడో, ఆ తక్షణమే వాడు కాపలా కాస్తున్న భవనం మాయమై పోయింది. కవలసోదరుల లాగానే వచ్చి రాక్షసుడి చేతిలో చిక్కిపోయిన రాకుమారుల శిలా ప్రతిమలు మాత్రం యింకా అక్కడ మిగిలివున్నై.

అప్పుడు సుహాసిని, "ఇంకా చూస్తారేం! మంత్రజలం తెచ్చి ఆ శిలా ప్రతిమలకు మామూలు స్వరూపాలు తెప్పించండి.'' అన్నది. అలా చేయగా, ప్రతిమలన్నీ రాకుమారులుగా మారినై.

వారంతా కవలసోదరులనూ, రాకుమార్తెలనూ ఎంతగానో మెచ్చుకున్నారు. తలవని తలంపుగా తమకు యిలా తిరిగి మామూలు స్వరూపాలు వచ్చినందుకు, వారు ఎంతో ఉప్పొంగిపోయారు. అయితే, యింత ఆనందంలోనూ అందరికీ కూడా ఒకే విధమైన చింత పట్టుకున్నది—తిరిగి తమ తమ ఇళ్ళకు చేరుకోవటం మాట అలా వుంచి, ఆ ప్రదేశంలో రెండవ రాక్షసుడి కంట పడకుండా మెలగటం ఎలాగ? అని.

దీనిని గురించే వాళ్ళంతా సమావేశమై తీవ్రంగా ఆలోచించారు. కాని ఎవరికీ ఉపాయమేదీ తోచలేదు. చివరకు ఉదయనుడు, ''మీరందరూ యిక్కడే వుండి





పోవటం క్షేమం కాదు. రాక్షసుడి చేతిలో చిక్కిన ఈ రాజకుమార్తెల నందరినీ క్షేమంగా వారి వారి ఇళ్ళకు చేర్చే బాధ్యత మాది. కనుక మీరు నిశ్చింతగా వెళ్ళిపోవచ్చు." అన్నాడు.

కాని ఇందుకు ఎవరూ ఒప్పుకో లేదు. వారిలో ఒక వృద్ధుడు, "అబ్బాయీ, మేము తిరిగి ఇళ్ళకు చేరుకోవటం మాత్రం మాటలా? గడ్డపు వాడిని తప్పించుకు పోవటం అసాధ్యం. కనుక మనం చెయ్యగలిగిన దల్లా ఒక్కటే. మమ్మల్ని తిరిగి శిలా ప్రతిమలుగా మార్చివేసెయ్," అన్నాడు. ఇందుకు కవలసోదరులు ఒప్పుకొనక తప్పిందికాదు. వాళ్ళ కోరిక ప్రకారం అందరినీ మళ్ళీ శిలాప్రతిమలుగా చేసివేశారు.

ఇక తమ సంగతి ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో రెండవ రాక్షసుడు వచ్చేశాడు. ఈ సారి వాడు వట్టి చేతులతో రాలేదు. ఒక రాకుమార్తెను వెంట తీసుకు వచ్చాడు. వాడు దగ్గరకు వస్తున్న అలికిడి అయింది. ఇంక ఆ తొందరలో కవలసోదరులు, గభీమంటూ కొలనులో దూకి, హంసలుగా మారిపోయారు.

మరుక్షణమే రాక్షసుడు కొలను చేరుకున్నాడు. తను తెచ్చిన ఆ రాకుమార్తెను కూడా కొలనులోకి విసిరివేశాడు. ఆమె కూడా హంసగా మారిపోయింది.

ఇలా రాకుమార్తెను కొలనులో విసిరివేసిన వెంటనే రాక్షసుడు మళ్ళీ ఒకసారి ఆ హంసలను లెక్కపెట్టసాగాడు. ఇంతకాలమూ కొలనులో వున్నది నలభై ఏడుగురేననీ, తన వ్రతం పూర్తి కావటానికి మరి ముగ్గురు తక్కువైనారనీ అనుకుంటూ వున్నాడు. ఆ రోజు తను తెచ్చిన రాకుమార్తెతో నలభై ఎనిమిది మంది కదా కావాలి? కాని లెక్కపెట్టగా యాభై ఒక్కమంది వుండటం చూసి, వాడు సంతోషంతో ఎగిరి గంతువేశాడు. మరుక్షణమే వాడికొక సందేహం కలిగింది. హంసలన్నిటినీ ఒడ్డుకు రప్పిం

చాడు. అవి నీటిలోంచి బైటికి రాగానే రాక్షసుడు, "మీలో కొత్తగా వచ్చిన ముగ్గురూ ఎవరు?" అని గద్దించి అడిగాడు.

కవలసోదరులు ముగ్గురూ ముందుకు వచ్చి, "మేమేను. అమాయకులైన ఈ రాకుమార్తెలను ఎందుకిలా బంధించి వుంచుతావు? ఇప్పటికైనా మించిపోలేదు. వీళ్ళని వదిలిపెట్టు, లేదా నీ తమ్ముడి గతి ఏమైందో నీకూ అదే కాబోతుంది," అని బెదిరించారు.

"ఆఁ, ఏమిటీ? నా తమ్ముడి గతా! ఏమైనాడువాడు?" అని రాక్షసుడు పెద్దగా బొబ్బలు పెట్టాడు.

"ఏమిటవుతాడు, మట్టిలో కలిసి పోయాడు. వాడితోపాటు నీ మాయాభవన మున్నూ...." అని కవలసోదరులు అంటూ వుండగానే రాక్షసుడు అక్కడ నిలవక ఒక్క పరుగున తన తమ్ముడు కాపలాకాస్తున్న భవనం వైపుకి పరుగెత్తాడు. చూస్తే ఏముంది? శిలాప్రతిమలు తప్ప మరేమీ కానరాలేదు.

కళ్ళవెంట చింత నిప్పులు రాలుస్తూ రాక్షసుడు తిరిగి వచ్చాడు. ఈలోగానే కవలసోదరులు తోటలోకి వెళ్ళి మామిడి కాయలు కోసి తిని కోతులుగా మారి పోయారు. రాక్షసుడికి అందకుండా



ఆ కోతులు ఒక చెట్టు మీది నుంచి, మరొక చెట్టు మీదికి దూకసాగినై.

చివరకు ప్రాణం విసిగి రాక్షసుడు, "కానివ్వండి, ఇలా ఎంతకాలం తప్పించుకు తిరుగుతారో నేనూ చూస్తాను," అంటూ మళ్ళీ గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన ఎగిరిపోయాడు.

మరికొద్ది సేపటికల్లా కోతులరూపంతో కవలసోదరులు తిరుగుతున్న చోటుకు గద్దపువాడు వచ్చి ప్రత్యక్షమయాడు.

కోతులను చూస్తూనే వాడు, "మంచి శాస్తి జరిగింది. లేకపోతే అంత కొవ్వా? ఇంకానయం, మిమ్మల్ని ప్రాణాలతో వదిలాడు," అన్నాడు.



రూపాలుపోయి మామూలు స్వరూపాలు వచ్చినై.

వాళ్ళను చూసి గడ్డపువాడు, ''ఇక్కడి చెట్లూ చేమలూ, వాటి మర్మాలూ మీకు బాగా తెలిసినట్టున్నదే? ఎరక్కపోయి మీ దగ్గరికి వచ్చాను. ఇంతటితోనైనా నన్ను విడిచిపెట్టండి, బాబూ!'' అంటూ మొరబెట్టుకున్నాడు.

''ఈసారి నిన్ను అంతంత మాత్రానికి వదిలేదిలేదయ్యా! ఇకమీది నుంచి నువ్వు, రాక్షసుడి సేవకుడివి కావు, మా సేవకుడివి. కనుక మేము చెప్పినట్టల్లా చెయ్యాలి. నీ మాయదండ ముందు మాకిప్పుడు యిచ్చివెయ్యి. రాక్షసుడిని గురించిన రహస్యాలు పూర్తిగా వెల్లడించు. ఇందుకు ఒప్పుకుంటే నిన్ను విడుదల చేస్తాం: లేదా యిలాగా వేళ్ళాడుతూ వుండవలసిందే!'' అన్నాడు ఉదయనుడు.

అందుకు గడ్డపువాడు, ''చాలా పెద్ద షరతులే పెట్టారే. మీ సేవకుడిగా వుండటానికి నా కేమీ అభ్యంతరం లేదు. మాయదండ కూడా మీ వశంచేస్తా. కాని, రాక్షసుడిని గురించిన రహస్యాలు మాత్రం అడగకండి. అవి వెల్లడించినట్టయితే, నేను తల పగిలి చస్తానని యిదివరకే నేను చెప్పానుగా. ఆ రహస్యం మీకు చెప్పి నేను చనిపోవటమా, లేక మీ సేవ

ఇలా అంటూ వున్నంతలో ఒక కోతి వచ్చి, అమాంతం వాడి నెత్తి మీద దూకింది. గడ్డపువాడు తల పైకి ఎత్తి చూచేటంతలో, మరొక కోతి, వాడి గడ్డం లంకించుకుని బర బర యీడ్చుకుపోసాగింది. మూడో కోతి, వాడి కాళ్ళు పట్టుకు వేళ్ళాడసాగింది. గడ్డపువాడు లబో దిబోమని మొత్తుకున్నాడు. కోతులు వాడిని వదలలేదు. గడ్డం లంకించుకున్న కోతి, వాడిని ఒక చెట్టు పైకి లాక్కుపోయి, గడ్డాన్ని ఆ చెట్టుకొమ్మకు వేలాడ గట్టి, గట్టిగా ముడివేసింది. ఆ వెంటనే, చెట్టు కింద మొలిచివున్న కుక్కగొడుగులు తినేసరికి కవలసోదరులకు కోతి

కుడుగానే వుంది. శాయశక్తులా మీకు సహాయం చేస్తూ వుండటమా? అని ప్రశ్న. ఐనా పట్టుదలతో ప్రయత్నిస్తే రాక్షసుడి రహస్యం తెలుసుకోలేక పోరు మీరు,'' అని మెడలోవున్న దండ తీసి యిచ్చాడు.

దండను అందుకుని ఉదయనుడు తన మెడలో వేసుకున్నాడు. గడ్డపువాడికి మానవ స్వరూపం వచ్చింది: ఉదయనుడికి గడ్డపువాడి స్వరూపం వచ్చింది. దానితో పాటు ఉదయనుడికి అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూ కూడా లభించినై.

వెంటనే ఉదయనుడు కొలను వద్దకు వెళ్ళి, అందులో హంసలుగా వున్న రాకుమార్తెలనూ వాళ్ళనూ బైటికి రమ్మన్నాడు. వాళ్ళు బైటికి వచ్చాక, అంతా బారులు తీర్చి కూచున్నారు. మాయ తువ్వాలు మహిమ వల్ల, అందరకూ బ్రహ్మాండమైన విందు చేశాడు. తరవాత శిలాప్రతిమలుగా మారి వున్న వాళ్ళకు మామూలు స్వరూపాలు తెప్పించి, వాళ్లకు కూడా విందు చేశాడు.

విందు అయాక ఉదయనుడు, గడ్డపువాడితో, ''వీళ్ళనందర్నీ తీసుకు వెళ్ళి, వాళ్ళ వాళ్ళ ఇళ్ళ దగ్గిర వదిలిరా,'' అన్నాడు.

అందుకు గడ్డపువాడు, ''ఇది చాలా కష్టమైన పని. రాక్షసుడి కంట బడ్డామంటే ప్రాణాలు దక్కవు. కనుక మరి



కొంత కాలం శిలాప్రతిమలనూ, హంసలనూ ఇక్కడనే వుండనివ్వండి. సమయం చూసి వాళ్ళను ఇళ్ళకు చేరుస్తా,'' అన్నాడు.

ఇందుకు కవలసోదరులు ఒప్పుకోగా, వాళ్ళను మళ్ళీ శిలాప్రతిమలుగానూ, హంసలుగానూ మార్చి, ఎవళ్ళ చోటుల్లో వాళ్ళను వుంచాడు.

ఇంతలో రాక్షసుడు వచ్చేశాడు. వాడు వస్తున్న సంగతి గ్రహించి గడ్డపువాడి ఆకారంలో వున్న ఉదయనుడు తన దగ్గిర వున్న భస్మం తీసి, తన సోదరుల పైనా, గడ్డపు వాడి పైనా చల్లాడు. రాక్షసుడు సరీగా అక్కడికి వచ్చి చేరుకునే సరికి, గడ్డపువాడి వేషంలో ఉదయనుడు మాత్రం నిలిచి వున్నాడు. వాడు తన సేవకుడైన గడ్డపువాడే ననుకుని రాక్షసుడు, ''ఆ కోతి మూక ఏమైంది?'' అని కోపంగా అడిగాడు.

''ఏమవుతారు? ముగ్గుర్నీ పీక నులిమి చంపేశాను,'' అన్నాడు ఉదయనుడు.

''ఏరీ, ఎక్కడ వాళ్ళు?'' అని ఆత్రంతో ప్రశ్నించాడు రాక్షసుడు.

''చూపుతాను, రా!'' అంటూ రాక్షసుడిని ఒక పాడు బావి దగ్గిరికి వెంట బెట్టుకు వెళ్ళి, తొంగి చూడమన్నాడు ఉదయనుడు.

ఆత్రం కొద్దీ రాక్షసుడు బావిలోకి తొంగి చూడబోయాడు. అంతకు ముందుగానే ఉదయనుడు, ఆ బావి ఒడ్డున తన కత్తి దాచి వుంచాడు. ఎప్పుడైతే రాక్షసుడు తొంగి చూడబోయాడో, సర్రున కత్తి దూసి ఒక్క వేటు వేశాడు ఉదయనుడు. రాక్షసుడి తల తెగి బావిలో పడింది గాని, చిత్రమేమిటో, రాక్షసుడికి మరొక తల మొలుచుకు వచ్చింది.

రాక్షసుడు గిరుక్కున తిరిగి, గడ్డపు వాడి వేషంలో వున్న ఉదయనుడిని గుప్పిటిలో పట్టి, ''ఎంత ద్రోహం! నా ఉప్పు తింటూ, నాకే ముప్పు తల పెట్టావా?'' అంటూ అతణ్ణి బావిలోకి విసిరివేశాడు. —(ఇంకా వుంది.)





# బొందితో నరకానికి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, బొందితో స్వర్గానికి వెళ్ళినవారు ఉన్నట్టు విన్నాం. కాని బొందితో నరకానికి వెళ్ళినవాళ్ళ కథ నువు విని ఉండవు. వాళ్ళ విచిత్ర కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

హేమంతదేశంలో ఒక విధవరాలు ఉండేది. ఆమెకు కుసుమవతి అని ఒక కుమార్తె ఉండేది. ఆ పిల్ల పసికందుగా ఉండగానే ఆమె తండ్రి పోయాడు. తరవాత విధవరాలు ముష్టి ఎత్తి జీవితం గడుపుతూ, ఎవరికీ తాను భారంగా ఉండకుండా ఊళ్ల వెంటతిరుగుతూ తన కుమార్తెను పెంచి పెద్దదాన్ని చేసింది.

## బేతాళ కథలు



కుసుమవతికి ఈడు వచ్చేనాటికి ఆమె తల్లి ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ఆమె శరీరంలో తిరిగే శక్తి కూడా తగ్గిపోయింది. అది చూసి కుసుమవతి తన తల్లితో, "అమ్మా, నేను పుట్టినది మొదలు నా కోసం పడరాని పాట్లన్నీ పడ్డావు. నీ దయవల్ల నాకు బలమూ, ఆరోగ్యమూ కూడా ఉన్నాయి. మనం ఇక ఊళ్ళు తిరగవద్దు. నన్ను ఏ గ్రామంలోనైనా పరువుగల ఇంట పనికి పెట్టావంటే, జీవితాంతం నిన్నే నేను పోషిస్తాను." అన్నది.

ఇందుకు తల్లి ఒప్పుకున్నది. వాళ్ళు త్వరలోనే ఒక సంపన్నమైన గ్రామం చేరుకున్నారు. చీకటి పడబోతూ ఉండటం వల్ల కుసుమవతి ఒక మంచి లోగిలి చూసి, ఆ ఇంటి పెద్దతో, "అమ్మా, ఈ రాత్రికి నన్నూ, మా అమ్మనూ మీ పంచన పడుకో నిస్తారా?" అని అడిగింది.

ఇంటి యజమానురాలు అందుకు ఒప్పుకోవటమే గాక, ఆ రాత్రి తల్లీ కూతుళ్ళకు కడుపునిండా తిండి పెట్టి, సావడిలో ఒక పక్క పడుకోనిచ్చింది.

మర్నాడు కుసుమవతి ఇంటావిడతో, "అమ్మగారూ, మీరు నన్ను పనికి పెట్టుకునేటట్టుంటే మీరు ఏ పని చెప్పినా చేస్తాను. నాకు వేరే జీతం కూడా వద్దు, నన్నూ మా అమ్మనూ పోషిస్తే చాలు. ఏ పరిస్థితిలోనూ నేను మా అమ్మను విడిచి పెట్టి ఉండను," అన్నది.

"ఈ ఇంట్లో పనికి తక్కువలేదమ్మా. నీ వంటి మనిషి చేతికి అందుబాటులో ఉంటే నాకు కావలిసిందేమిటి? మీరిద్దరూ ఇక్కడే ఉండిపొండి," అన్నది ఇంటావిడ.

ఇంటి వెనక ఒక చిన్న కొట్టు ఉన్నది. కుసుమవతి తన తల్లి ఉండటానికి ఆ కొట్టు తీసుకున్నది. ఆమె రోజూ తెల్లవారుతూనే లేచి పనిలోకి వెళ్ళి, తన తల్లి వద్దకు అన్నం పెట్టటానికి మటుకు వచ్చేది. వచ్చినప్పుడల్లా, "ఎలా ఉన్నావమ్మా?"

అని అడిగి కనుక్కొనేది. కుసుమవతి పనితనం ఇంటిల్లిపాదికీ ఎంతో నచ్చింది. ఇంటి విషయాలూ, కుటుంబ విషయాలూ దాచకుండా వాళ్ళు కుసుమవతికి చెప్పేవారు.

ఇలా రెండు నెలలు గడిచింది. ఒక రోజు సాయంకాలం కుసుమవతి బిందెతో నీళ్లు తెస్తూండగా, ఇంటి వెనక ప్రాంతంలో ఆమెకు బలిష్ఠంగా ఉన్న యువకుడు ఒకడు కనిపించి, "నువు ఇక్కడి మనిషివి కావే?" అన్నాడు.

"అవునండి. నేను కూడా మిమ్మల్ని చూడలేదే?" అన్నది కుసుమవతి.

"కొంత కాలంగా నేను ఈ ప్రాంతాల లేను. నీ నుంచి నాకు ఒక సహాయం కావాలి. నా గురించి ఒక సంవత్సరం పాటు ఎవరికీ తెలియకుండా చూశావంటే నేను నరకం నుంచి బయటపడి, అందరి లాగా బతకగలుగుతాను. నేను ఈ యింటి వారికి ఒక్కగానొక్క కొడుకును. అవివేకంగా నేను పిశాచాలను ధిక్కరించి నరకంలో చిక్కుకున్నాను. ఇంకొక్క సంవత్సరం పాటు నరకయాతన తప్పదు," అన్నాడు ఆ యువకుడు.

"మీ రహస్యం నేను దాస్తాను. మీకు ఏ విధంగా సహాయపడగలనో చెప్పండి," అన్నది కుసుమవతి.

"ఈ యింటి యజమానురాలు నా తల్లి. నేను కనపడకుండా పోయినప్పటినుంచీ ఆమె నా గదికి తాళం పెట్టి ఉంచింది.





ఆ గది నీకు కావాలని చెప్పు. ఆమె ఇయ్యనంటే నీ తల్లిని తీసుకుని వెళ్ళిపోతానని బెదిరించు. ఇక నేను వెళ్లాలి. నీకు మళ్ళీ కనిపిస్తాను,'' అంటూ ఆ యువకుడు అదృశ్యమైపోయాడు.

కుసుమవతి ఇంటికి వెళ్లి, యజమానురాలిని గది అడిగి, ''ఆ గది ఎందుకూ పనికిరాకుండా పడి ఉన్నది. నేను ఉండటానికి ఆ గది ఇస్తే మరింత సుఖంగా నిద్రపోయి, మరింత బాగా పని చేస్తాను,'' అన్నది.

ఇంటావిడకు కోపం వచ్చింది.

''ఏమిటి నీ ధైర్యం? ఆ గది చచ్చిపోయిన నా కొడుకుది. వాడి శవాన్ని ఆ గది నుంచి బయటకి తీసినాక అందులోకి ఎవరినీ అడుగుపెట్టనియ్యలేదు. ప్రేతకర్మలన్నా జరగకుండా మా వాడి శవం మాయమయింది. పిశాచాలు ఎత్తుకుపోయాయన్నారు. ఆ గదినా అడుగుతున్నావు? ఇంకా నయం!'' అన్నది ఇంటావిడ.

''అలా అయితే నన్ను పంపించెయ్యండి,'' అన్నది కుసుమవతి.

ఈ మాటతో ఇంటావిడ దిగివచ్చి, ''ఎప్పటికైనా ఆ గది తెరవవలసిందే అనుకో. ఆ గది కారణంగా నిన్ను వదులుకోవటం నాకు నచ్చలేదు,'' అంటూ గది తాళపు చెవి వెతికి తెచ్చి, కుసుమకు ఇచ్చింది. కుసుమ ఆవిడకు కృతజ్ఞత తెలుపుకుని, గది తలుపులూ, కిటికీలూ తెరిచి, గాలి పారేటట్టు చేసి, గది అంతా దులిపి, తుడిచి శుభ్రం చేసింది.

ఆ గదిలో అదివరకే మంచమూ, పరుపూ ఉన్నాయి. ఆ రాత్రి కుసుమ పక్క వేసుకుని ఆ గదిలో పడుకున్నది. అర్థరాత్రి వేళ తలుపు తోసుకుని ఆ యువకుడే వచ్చాడు. ఇద్దరూ పలకరించుకున్నారు. అతను ఆమెకు తాను బొందితో నరకానికి ఎలా వెళ్ళినదీ చెప్పాడు. అతను నిజంగా చావలేదు. అతని మీద అధికారం సంపాదించిన

పిశాచాలు అతన్ని చచ్చిపోయినట్టు చేసి, తరవాత అతని శరీరాన్ని నరకానికి చేర్చాయి. అక్కడ అతను నరకంలో వాళ్ళకు రకరకాల సేవలు చేస్తున్నాడు. అతని విముక్తికి ఇంకా ఒక్క ఏడు గడువున్నది. అతను ఒక గంటసేపు ఎక్కడైనా రావచ్చు గాని, అయిన వాళ్ళ కంట పడరాదు.

ఆ యువకుడు ఆ రాత్రి ఆమెతో ఒక గంట గడిపి తిరిగి వెళ్ళిపోయాడు.

అదిమొదలు అతను రోజూ రాత్రి పూట కుసుమ దగ్గిరికి వచ్చి, ఆమెతో కొంతసేపు గడిపి, పిశాచాల వెంట నరకానికి తిరిగిపోతూ వచ్చాడు. కుసుమ గర్భవతి అయింది. ఆ సంగతి ఇంటి యజమానురాలు కనిపెట్టింది. కుసుమకు పుట్టబోయే బిడ్డకు తండ్రి ఎవరో తెలుసుకునేటందుకు ఇంటి యజమానురాలు విశ్వప్రయత్నం చేసింది. కాని కుసుమ రహస్యం ఆమెకు అంతు చిక్కలేదు.

ఇంతలో ఒకరోజు కుసుమ పనిలోకి రాలేదు. ఇంటి యజమానురాలు కుసుమ గది వద్దకు వెళ్ళి శ్రద్ధగా విన్నది. లోపల కుసుమతో ఎవరో మాట్లాడుతున్నారు.

ఇంటి యజమానురాలు తలుపు సందుల్లో నుంచి లోపలికి చూసింది. కుసుమ చంటిబిడ్డకు పాలిస్తున్నది. ఆమెకు ఎదురుగా కూర్చుని ఆమెతో మాట్లాడుతున్నవాడు—తన కొడుకే!





అంతలోనే ఆమెకు తన కొడుకు ఏనాడో చచ్చిపోయిన సంగతి గుర్తుకు వచ్చి, అక్కడినుంచి వేగంగా వెళ్ళి పోయింది.

తరవాత కొద్ది రోజులకు కుసుమ పక్కమీది నుంచి లేచి, గది తలుపులు తెరిచింది. అప్పుడు ఒక ఇంటి పనిమనిషి వచ్చి, "అమ్మగారు, పెద్ద కావడి పెట్టెను నీ గదిలో కొద్ది రోజులు పెట్టమన్నారు. అందులో ఎవరివో వెండి బంగారాలు దాచబెట్టారుట," అన్నది.

కుసుమ అందుకు సమ్మతించింది. సాయంత్రం వేళ కావడిపెట్టె కుసుమ గదిలోకి చేరింది. అందులో ఇంటి యజమానురాలు కూర్చుని, తాళం కంతలో నుంచి చూస్తున్నది.

అర్ధరాత్రివేళ ఆమె కొడుకు గదిలోకి వచ్చి కూర్చుని కుసుమతో మాట్లాడ సాగాడు. ఇంటి యజమానురాలు మనసు పట్టలేక, కావడిపెట్టె మూత ఎత్తి బయటికి వచ్చి, "నాయనా, నువ్వేనుట్రా?" అంటూ కొడుకును కౌగలించుకున్నది.

కొడుకు ఇందుకు సంతోషించటానికి బదులుగా, "ఎంత పాడు పని చేశావమ్మా! ఇంకొక్క నెల ఓపికపట్టితే నేను ఎప్పటిలాగా వచ్చి ఉండిపొయ్యేవాణ్ణి కద! నేనిప్పుడు నరకంలో ఇంకా ఏడేళ్ళు గడపాలి!" అన్నాడు.

"నిన్ను మళ్ళీ పోనిస్తానుట్రా? నా బొందిలో ఊపిరి ఉండగా వెళ్ళవు," అన్నది తల్లి.

"పిశాచాలను నువు అడ్డలేవమ్మా! అది నీ తరం కాదు," అన్నాడు కొడుకు.

తల్లి గది బయటికి వెళ్ళి పిశాచాల కోసం కాపలా వేసింది. ఎంతకూ వాళ్ళు రాలేదు. లోపల మాట్లాడుతున్న కొడుకు కంఠం ఆగిపోయినట్టు తెలిసి ఆమె గదిలోకి తొంగి చూసింది. గదిలో కొడుకు లేడు.

అతన్ని పిశాచాలు ఎత్తుకుపోయే లోపల కుసుమ తన భర్తతో, "నా తల్లినీ,

బిడ్డనూ ఎవరైనా కనిపెట్టుకుని ఉండే పక్షంలో మీకు బదులుగా నేను నరకానికి వెళ్ళి, ఏడేళ్ళపాటు అక్కడి వాళ్ళకు చాకిరీ చేస్తాను,'' అన్నది.

''మీ అమ్మను నేను కనిపెట్టి ఉంటా నని ప్రమాణం చేస్తున్నాను,'' అన్నాడు ఆమె భర్త. తరవాత అతను పిశాచాలను మార్పిడికి ఒప్పించాడు. కుసుమ తన కొడుకును ముద్దు పెట్టుకుని, పిశాచాల వెంట నరకానికి వెళ్ళిపోయింది. తన కొడుకు శాశ్వతంగా తనకు దక్కినందుకు ఇంటి యజమానురాలు సంతోషించింది.



ఒక్క క్షణమైనా నరకంలో ఉండటం ఎంత కష్టమో కుసుమకు తెలిసి వచ్చింది. తన భర్తను ఏడేళ్ళ నరకయాతన నుంచి కాపాడాను గదా అన్న సంతృప్తితో ఆమె నరకంలో గడువు తీరినదాకా చాకిరీ చేసింది.

చివరకు ఆమెకు నరకం నుంచి విముక్తి కలిగింది. పిశాచాలు ఆమెను ఆమె ఇంటి దగ్గిర దిగబెట్టాయి. ఇల్లంతా సందడిగా ఉన్నది. ఇంటి లోపలా బయటా కూడా జనం కోలాహలం చేస్తు న్నారు. ఇంటివారి అబ్బాయికి పెళ్ళి జరుగుతున్నట్టు కుసుమ విన్నది. తన భర్త తనకోసం గడువు పూర్తి అయేదాకా వేచి ఉండక, సరిగా తాను వచ్చే సమ యానికి మరొకతెను చేసుకుంటున్నా డంటే ఆమె నమ్మలేకపోయింది. తన తల్లి కొద్దిరోజుల క్రితం పోయిందట.

బీదవాళ్ళకు ఏవో కానుకలు పంచి పెట్టుతున్నారు. కుసుమ భర్త మగ వాళ్ళకూ, అత్తగారు ఆడవాళ్ళకూ, ఏడేళ్ళు నిండిన ఆమె కొడుకు పిల్లలకూ ఏవేవో బహుమతులు పంచుతున్నారు. ముగ్గురి ముఖాలలోనూ ఆనందం చిందు లాడుతున్నది. ముగ్గురూ కుసుమను చూశారు, కాని గుర్తించలేదు.

తన అత్తగారు ఇయ్యబోయిన చీరా, రవికా తీసుకోకుండా కుసుమ అక్కడి నుంచి కదిలి వెళ్ళిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కుసుమవతి తన భర్తకు మారుగా తాను నరకానికి ఎందుకు వెళ్ళింది? భర్త మీది ప్రేమచేతనా? లేక అది భార్యగా తన ధర్మం అనుకునా? అంత త్యాగం చేసిన మనిషి తాను ఫలానా అని చెప్పి, తన భర్త మరొకరిని పెళ్ళి చేసుకోకుండా ఎందుకు ఆపలేదు? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కుసుమవతి కష్టపడటానికి భయపడే మనిషి కాదు. కాని ఆమె ఇతరులు కష్టపడితే సహించ లేదు. అందుచేతనే ఆమె తన కష్టంతో తల్లిని సుఖపెట్టటానికి పూనుకున్నది. ఆమె తన భర్తను ప్రేమించిందనటానికి ఆధారం లేదు. అతను నరకయాతన అనుభవిస్తున్నాడన్న జాలితో అతనికి భార్య అయింది. ఆమె తన భర్తకు బదులు నరకానికి వెళ్ళటానికి కారణం భర్తకు నరకబాధ తొలగించటంతో బాటు, తల్లి కొడుకులు విడిపోకుండా చూడటా నికి కూడా కావచ్చు. కుసుమను భర్త ప్రేమించాడనటానికి కూడా ఆధారం లేదు. అతను తాను నరకం నుంచి బయటపడటానికి ఆమెను సాధనంగా వాడుకున్నాడు. ఆమె తనకు బదులు నరకానికి పోతానంటే అతను ఎలాటి అభ్యంతరమూ చెప్పలేదు. ఏడు సంవత్స రాల గడువు అయిపోయిందని నలుగురూ నమ్మిన మరుక్షణం అతను మరొక భార్యను చూసుకున్నాడు. కుసుమ తల్లి కోసమూ, కొడుకు కోసమూ జీవించాలి. తల్లి పోయింది. కొడుకు నిక్షేపంలా గున్నాడు. నరకంలో ఏడేళ్ళు చాకిరీ చేసి వచ్చిన మనిషి మనుషులకు అవ లీలగా చాకిరి చేసి పొట్టపోసుకోగలదు. ఆ పని చెయ్యటానికే కుసుమ నిశ్చ యించుకుని ఉంటుంది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# సమర్థుడైన సేనాపతి

చంపావతిని ఏలే రుద్రదేవుడు దక్షత గల రాజు. ఆయన తన ప్రజలను సొంత బిడ్డలలాగా చూసుకోవటమే గాక తన కింది వారి అభిప్రాయాలను శ్రద్ధగా పాటించేవాడు; తన మంత్రుల సలహాలను ఎన్నడూ తోసిపుచ్చేవాడు కాడు.

రుద్రదేవుడికి వేటాడటం అంటే చాలా సరదా. ఆయన తరచుగా ఒక్క మనిషిని మాత్రమే వెంటబెట్టుకుని వెళ్ళేవాడు. ఆయన తనతో తన దర్బారు ఉద్యోగుల కొడుకులనే వేటకు తీసుకుపోయేవాడు.

ఒకసారి ఆయన వెంట ఆస్థాన వైద్యుడి కొడుకు రత్నకుమారుడు అనే వాడు వేటకు వెళ్ళాడు. అతను ఇరవై రెండు సంవత్సరాల వయసులో, చాలా బలంగానూ, ఆరోగ్యంగానూ ఉండేవాడు.

ఉదయంవేళ ఇద్దరూ అరణ్యం ప్రవేశించారు. కాని అపరాహ్ణం కావస్తూ ఉన్నా రాజుకు ఒక్క జంతువూ చిక్కలేదు. ఇద్దరూ తెగ అలిసిపోయి, ఒక చెట్టు కింద విశ్రాంతి తీసుకున్నారు.

ఆ సమయంలో అంత దూరాన ఒక ఖడ్గమృగం వారికి కనిపించింది. అది వాళ్ళున్న వైపే అమిత వేగంగా దూసుకు వస్తున్నది. ప్రమాదం నుంచి ఎలా బయటపడాలో తోచక రాజు తికమక పడ్డాడు. రత్నకుమారుడు మాత్రం ఏమీ కలవరపడలేదు. ఖడ్గమృగం చర్మం కవచంలాగా ఉంటుంది; దాన్ని ఖడ్గంగాని, బాణంగాని ఛేదించలేదు. ఆ సంగతి తెలిసి, అతను ఒక్క కత్తి దెబ్బతో ఒక అరటిచెట్టు నరికి, దాన్ని తన చేతులలో దృఢంగా పట్టుకుని నిలబడ్డాడు. ఖడ్గమృగం తనకు సమీపంగా రాగానే అతను రెప్పపాటు కాలంలో ఆ అరటిచెట్టును గురిగా ఖడ్గమృగం

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ముక్కు మీది కొమ్ములో దిగబడేటట్టు విసిరి వేశాడు.

ఖడ్గమృగం తూలి ముందుకు ఒరిగింది. అదే క్షణంలో రత్నకుమారుడు తన కత్తిని ఖడ్గమృగం ఎడమ కంటి కుండా, దాని మెదడులోకి దిగిపోయేటట్టు గుచ్చాడు. ఒక్కసారి ఖడ్గమృగం నిలువునా కంపించి, కిందపడి ప్రాణం వదిలింది.

ఈ అనుకోని సంఘటన వల్ల రాజుకు కొంతసేపు నోట మాట రాలేదు. తరవాత అయన రత్నకుమారుడికి ధన్యవాదాలు చెప్పి, ఎంతో మెచ్చుకున్నాడు. నిజానికి రత్నకుమారుడి సమయస్ఫూర్తీ, సాహసమూ రాజును ముగ్ధుణ్ణి చేశాయి. ఆ రోజు అతను రాజు ప్రాణాలు కాపాడాడు. ఆ కృతజ్ఞత రాజు హృదయంలో స్థిరంగా ఉండిపోయింది.

రుద్రదేవుడు తన వెంట వేటకు తన కొలువులో ఉండే అందరు ఉన్నతాధికార్ల కొడుకులనూ తీసుకుపోయి ఉన్నాడు. కాని రత్నకుమారుడు చూపిన ధైర్యసాహసాలు మరెవరిలోనూ కనబడలేదు. అరణ్యంలో ఎప్పుడు ఏ చిక్కు ఎదురైనా రాజు తానే దాన్ని ఎదుర్కొనటమూ, తన వెంట ఉన్నవాడు చూస్తూ నిలబడటమూ జరిగింది. ఈసారి మాత్రం రుద్రదేవుడు కొయ్యబారిపోయి నిలబడి ఉండగా రత్నకుమారుడు అపాయాన్ని ఎదుర్కొన్నాడు.

తరవాత కూడా రత్నకుమారుడు రాజు వెంట అనేకసార్లు వేటకు వెళ్ళి, తన శక్తి సామర్థ్యాలు రుజువు చేశాడు. అందుచేత రుద్రదేవుడు, "ఈ కుర్రవాడు ముందు ముందు నాకు సేనాపతి అయితే బాగుండును," అనుకుంటూ వచ్చాడు. కాని ఏ పదవిలో నైనా ఆ పదవి నిర్వహించిన వాడి కొడుకునే నియమించటం ఆచారంగా ఉంటున్నది. సేనాపతి స్థానంలో రాజు మరెవరినో నియమిస్తే పదిమందీ ఆక్షేపించక పోవచ్చు, కాని వాళ్లు దాన్ని

ఆమోదించరు. అది రుద్రదేవుడికి ఇష్టం లేదు.

కొంతకాలం గడిచింది. వయసు మళ్ళిన సేనాపతి జబ్బుపడి మరణించాడు. సేనాపతి పదవికి చనిపోయిన వాడి కొడుకును, ఉత్పలసింహుడు అనే వాణ్ణి, నియమించమని మంత్రులు ఆన వాయితీప్రకారం రాజుకు సలహా ఇచ్చారు.

ఇది రాజుకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. అందుచేత ఆయన తన మంత్రులతో, "ఈనాడు మన బలగానికి చెందిన యువకులతో బల, ధైర్య, సాహసాలు కలిగిన వాళ్ళు చాలామంది ఉన్నారు. వారందరికీ సేనాపతి పదవి నిర్వహించే యోగ్యత ఉన్నది," అన్నాడు.

"కాని, మహారాజా సేనాపతి కొడుకునే సేనాపతిగా నియమించటం మన ఆచారం గద?" అన్నారు మంత్రులు.

"అది నిజమే. నేను మీకు సమ్మతం కాని పని ఏదీ చెయ్యను," అన్నాడు రాజు.

తరవాత, ఆస్థాన ఇంద్రజాలికుడు రంగరాజ్ రాజు వద్దకు వచ్చి, "మహా రాజా, దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నారు. ఏమిటి కారణం?" అని అడిగాడు.

"మరేమీ లేదు. కొత్త సేనాపతిని నియమించటం గురించే," అన్నాడు రాజు.

"సేనాపతి కొడుకు ఉన్నాడు గదా!" అన్నాడు రంగరాజ్.





"లేదు. లేదు. ఆ పదవిలో మరొకరిని నియమించాలని నా అభిప్రాయం. కాని అలా చేసి అందరినీ నొప్పించటం నాకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. అందుచేత ఇది తేలని సమస్య అయి కూర్చున్నది!" అన్నాడు రుద్రదేవుడు.

"నాలో తమరు నమ్మకం ఉంచగలిగితే ఈ సమస్యను నేను పరిష్కరించగలనేమో?" అన్నాడు రంగరాజ్.

"అరె, నీ మాటే మరిచాను సుమా! నీ అతీత శక్తులతో నాకు కలిగిన సమస్య తీరుతుందేమో!" అన్నాడు రాజు.

"అతీత శక్తులు దేనికి, మహారాజా? యుక్తి చాలు!" అన్నాడు రంగరాజ్.

అతను మర్నాడు కనపడి తన ఆలోచన చెప్పుతానని మాట ఇచ్చి, రాజు వద్ద సెలవు పుచ్చుకున్నాడు.

తిరిగి అతను రాజును కలుసుకుని, "మహారాజా, నా యుక్తి సిద్ధంగా ఉన్నది. మీరు సేనాపతి పదవి ఎవరికి ఇద్దామనుకుంటున్నారు?" అని అడిగాడు.

"మన అస్థాన వైద్యుడి కొడుకు రత్నకుమారుడికి. అందరిలోకీ అతనే ఆ పదవికి అర్హుడని నా నమ్మకం," అన్నాడు రాజు.

"మహారాజా. అలా అయితే యుద్ధవిద్యలలో పోటీ ప్రదర్శనం ఏర్పాటు చేసి నలుగురిని ఎన్నిక చెయ్యండి. ఆ పోటీలో రత్నకుమారుణ్ణీ, ఉత్పలసింహుణ్ణీ, పాల్గొననియ్యండి. పోటీలో రత్నకుమారుడు నెగ్గుతాడు గదా?" అని రంగరాజ్ అడిగాడు.

"అందరినీ మించుతాడు," అన్నాడు రాజు.

"మంచిది, మహారాజా. ఈ పోటీ సరదాగా ఏర్పాటు చేస్తున్నట్టు ప్రకటించి, మీ మంత్రులతో మాత్రం, ఈసారి సేనాపతి నియామకం కొత్త పద్ధతిలో జరుగుతుందనీ, అది కేవలమూ దైవనిర్ణయంగా ఉంటుందనీ చెప్పి పెట్టండి," అన్నాడు రంగరాజ్.



పోటీ సక్రమంగా జరిగింది. అందులో రత్నకుమారుడు మొదటివాడు గానూ, ఉత్పలసింహుడు రెండోవాడు గానూ, న్యాయవ్యవహారాల మంత్రి కొడుకు అర్జునుడు అనేవాడు మూడోవాడుగానూ, ఒక కులీనుడి కొడుకు సంపత్ అనేవాడు నాలుగోవాడు గానూ వచ్చారు.

మర్నాడు నిండు సభలో రుద్రదేవుడు తన మంత్రి సామంతులతో ఇలా అన్నాడు:

"నేను చేయబోయే సూచనను మీరందరూ ఆమోదిస్తారని నమ్ముతున్నాను. ఇటీవల జరిగిన పోటీలలో నలుగురు యువకులు తమ సామర్థ్యాన్ని నిరూపించుకున్నారు. చనిపోయిన మన సేనాపతికి కుమారుడైన ఉత్పలసింహుడు వారిలో ఒకడు. కొత్త సేనాపతిగా నియమించబడే అవకాశం ఈ నలుగురిలో ఎవరికి దక్కుతుందో పరీక్షించి నిర్ణయించాను. ఇది సంప్రదాయ విరుద్ధమని నాకు తెలుసును. కాని కొత్త మార్గాలు అవలంబించకుండా పురోగమనం సాధ్యం కాదని మీరు గ్రహించాలి. నా యీ పథకాన్ని మీరందరూ హృదయపూర్వకంగా ఆమోదిస్తారనుకుంటాను."

చాలామంది రుద్రదేవుడిపై గల గౌరవం కొద్దీ ఆయన అవలంబించ దలచిన కొత్త పద్ధతికి సమ్మతించారు.

"అలా అయితే నా పథకాన్ని అమలులో పెడదాం," అని రుద్రదేవుడు, తన పక్కనే ఉన్న రాణీ సులతతో, "మహారాణిగారు కాస్త సహాయపడాలి," అన్నాడు.

ఆమె అంగీకరించింది.

నాలుగు అట్ట ముక్కలూ, వాటి కోసం నాలుగు కవర్లూ రాణీగారికి ఇచ్చారు. నాలుగు అట్ట ముక్కల మీదా నలుగురు పోటీ దార్ల పేర్లూ రాసి ఉన్నాయి.

రాణిగారు పక్కనే ఉన్న గదిలోకి ఏకాంతంగా వెళ్ళి, ఒక్కొక్క కవరులోనూ ఒక్కొక్క పోటీ దారు పేరుగల అట్టముక్కను ఉంచి, కవరు అంటించి తీసుకు వచ్చి, రాజుకు ఇచ్చింది.

ఆమె మొదటి కవరు తీసుకు వస్తూం డగా రాజు "ఉత్పలసింహ" అన్నాడు. మంత్రి ఆ కవరు మీద ఉత్పలసింహుడి పేరు రాశాడు. రాణి రెండో కవరు తెస్తూండగా రాజు, "సంపత్", అన్నాడు. మంత్రి రెండో కవరు మీద సంపత్ పేరు రాశాడు. అలాగే మూడోసారి రాజు "రత్న కుమార్" అనీ, నాలుగోసారి "అర్జున" అనీ చెప్పటమూ, మంత్రి మూడు, నాలుగు కవర్ల మీద ఆ పేర్లు రాయటమూ జరిగింది.

తరవాత రాజు సభవారితో, "కవర్ల లోపల అట్టల మీద ఎవరి పేర్లు ఉన్నదీ చూడకుండా నేను నోటికి వచ్చిన పేర్లు చెప్పాను. దైవికంగా కవరు మీది పేరూ, దానిలో ఉన్న పేరూ ఒకటే అయితే ఆ పేరుగల వాణ్ణి సేనాపతిగా నియమిస్తాను," అన్నాడు.

అన్ని కవర్లూ చించి చూడగా ఒక్క రత్నకుమారుడి పేరే కవరు మీదా, అట్ట మీదా కూడా ఉన్నట్టు స్పష్టమయింది. ఆ విధంగా రత్నకుమారుడు సేనాపతి పదవి అందుకుని, తన శక్తి సామర్థ్యాలు రుజువు చేశాడు.

అభ్యంతర మందిరంలో కబుర్లు చెప్పుకునేటప్పుడు రాణి, రాజుతో, "మీ యుక్తి పారటానికి నేనే సహాయపడ్డాను," అన్నది.

"ఏ పేరున్న కవరు ఎలా పట్టుకుని తీసుకు రావాలో నీకు బోధించిన వాడు రంగరాజ్. నువు దిగువ మూల పట్టుకున్న కవరులో ఉత్పలుడి పేరూ, పక్కవాటంగా పట్టుకున్న దానిలో సంపత్ పేరూ, పై కొస పట్టుకున్న దానిలో రత్నకుమారుడి పేరూ, పై భాగం మధ్య పట్టుకున్న దానిలో అర్జునుడి పేరూ ఉన్నదని తెలుసుకుని, రత్నకుమారుడి పేరు తప్ప మిగిలినవన్నీ మార్చి చెప్పాను," అన్నాడు రాజు.

ఈ విధంగా సహాయపడినందుకు రంగరాజ్‌కు, రుద్రదేవుడి నుంచి మంచి బహుమానం ముట్టింది.



# 162. ఉప్పుకొండ

ఈ బొమ్మలో మనకు కనిపించేదంతా స్వచ్ఛమైన ఉప్పు! ఇది డొమినికన్ రిపబ్లిక్ (పశ్చిమ దీవులు) లోని కబ్రాల్ సమీపంలో ఉన్న కొండ. ఈ ఉప్పు ఎంత స్వచ్ఛమైనదంటే దాన్ని గుళికలు చేసి మంచుగడ్డ అని యాత్రికుల కిస్తే, వాళ్ళు వాటిని తమ పానీయాలలో వేసుకునేవారు! ఈ కొండ ఒకప్పుడు సముద్రగర్భంలో ఉండేది.





# వీరయ్యదయ్యం

ఒక ఊళ్ళో వీరయ్యా అనే రైతు ఉండే వాడు. అతని భార్య పేరు మంగమ్మ. వాళ్ళకు రాజయ్యా అనే కొడుకు ఉండే వాడు. రాజయ్యా ముమ్మూర్తులా తండ్రి పోలికే.

నాట్ల తరుణంలో ఒకనాడు వీరయ్యా చీకటితో ఇంటి నుంచి బయలుదేరి పొలానికి వెళ్ళాడు. వెళ్ళిన కొంతసేపటికి నలుగురు మనుషులు వీరయ్యా శవాన్ని ఇంటికి చేర్చారు. చీకట్లో అతన్ని పాము కరిచింది.

ఇరుగుపొరుగుల సహాయంతో రాజయ్యా తండ్రికి దహనక్రియలు జరిపించి వచ్చాడు.

ఇంటి దగ్గిర ఏడ్చి, ఏడ్చి, సొమ్మసిల్లి పడిపోయిన మంగమ్మకు మగతనిద్రలో ఒక కల వచ్చింది. తన భర్త దయ్యమై, వికృతంగా నవ్వుతూ, గుడ్లగూబలా అరుస్తూ, శ్మశానం దగ్గిర ఉన్న మర్రి చెట్టు మీదికి ఎగిరిపోయినట్టు ఆమె కల గని, కెవ్వున అరిచి, లేచి కూర్చున్నది.

ఆమెను కనిపెట్టుకుని ఉన్న ఇరుగు పొరుగు అమ్మలక్కలు, "ఏమయింది, మంగమ్మా? పీడ కలగానీ వచ్చిందా?" అని అడిగారు.

"నా మొగుడు దయ్యం అయాడు!" అంటూ మంగమ్మ తనకు వచ్చిన కల వివరంగా వాళ్ళకు చెప్పింది.

వీరయ్యా పోయిన మూడో రోజున, శ్మశానం దగ్గిర మర్రిచెట్టు కింద మూర్ఛపోయి పడి ఉన్న ఒక కోమటిని ఊరివాళ్ళు తీసుకువచ్చి, ఉపచారాలు చేసి, తెలివి తెప్పించారు. కోమటి మొదట పిచ్చిచూపులు చూసి, తరవాత తేరుకుని, క్రితం రాత్రి తనకు జరిగినది చెప్పాడు.

ఎం. కామేశ్వరరావు

ఆ కోమటిది సమీపంలో ఉన్న మరొక గ్రామం. అతను తన దుకాణానికి కావలిసిన సరుకులన్నీ ఎప్పుడూ ఈ వూరి నుంచే పట్టుకుపోయేవాడు. ఆ ప్రకారమే అతను మూడో ఝామున లేచి, ఈ ఊరికి సరుకుల కోసం బయలుదేరాడు. దారి అతనికి అలవాటైనదే. అతను శ్మశానం దగ్గిరికి వచ్చేసరికి నక్కలూ, గుడ్లగూబలూ అరవటం వినిపించి భయం పుట్టింది. మర్రి ఆకులు గలగలమన్నాయి. మర్రి ఊడ పట్టుకుని, తెల్లని పంచే, లాల్చీవేసుకుని ఎవరో ఊగుతున్నట్టు అతనికి లీలగా కనిపించింది. అసలే ఆ కోమటికి దయ్యాల భయం! దానికి తగ్గట్టుగా ఆ దయ్యం, "ఒరే కోమటీ, నీ దగ్గిర ఉన్న డబ్బు ఇలా ఇచ్చిపో! నా పెళ్ళాంబిడ్డలకు జరుగుబాటు కావద్దా? నేనెవరో తెలుసా? వీరయ్యను!" అన్నది.

వెంటనే కోమటికి స్పృహ తప్పింది.

కోమటి మాటలలో నమ్మకం కుదిరి ఊరివాళ్ళు, కోమటి పోగొట్టుకున్న డబ్బు కోసం మంగమ్మ ఇల్లంతా గాలించారు. కాని వాళ్ళకు అక్కడ చిల్లిగవ్వ కూడా దొరకలేదు.

మంగమ్మ వెక్కి వెక్కి ఏడ్చింది. గంగిగోవు లాటి తన భర్త దయ్యం కావటమేగాక, బాటసారులను బాధించి దోచుకోవటం ఆమెకు చాలా బాధ కలిగించింది.






మంగమ్మ పట్ల ఊళ్ళోవాళ్ల ప్రవర్తన కూడా మారిపోయింది. వాళ్ళు ఆమెను పలకరించటం మానేశారు. ఆమె కన బడితే మొహం తిప్పుకోసాగారు.

మర్నాడు అర్ధరాత్రి పొద్దుపోయి పొరుగూరు నుంచి వస్తున్న ఆడమనిషి నగలు దయ్యం దోచేసి, "ఈ నగలు నా పెళ్లాం పెట్టుకుంటే మరింత అందంగా ఉంటుంది!" అన్నది.

మర్నాడు ఊరి వాళ్ళంతా ఏకమై వచ్చి, మంగమ్మ ఇంటిని సోదాచేసి, ఏమీ దొరక్కపోయినా, "నీ మొగుడు ఈ ఊరికి పెద్ద పీడ అయి కూర్చున్నాడు. వాణ్ణి మర్యాదగా ఊరువదిలి వెళ్ళమను. లేకపోతే నీ మర్యాద దక్కదు!" అని బెదిరించి వెళ్ళిపోయారు.

మంగమ్మకు ఏమీ పాలుపోలేదు. తనకూ, చచ్చిపోయిన తన భర్తకూ ఇంకా సంబంధం ఉన్నదనే ఊరివాళ్ళు అనుకుంటున్నారు!

వరసగా మరి ముగ్గురికి దయ్యం కనిపించింది. చీకటి పడితే ఎవరూ శ్మశానం చాయలకు పోవటం లేదు, అటు నుంచి రావటమూ లేదు.

ఊళ్ళోవాళ్ళు మాత్రం తమలో తాము చర్చించుకుని, మంగమ్మతో, "నువ్వూ, నీ కొడుకూ ఈ ఊరు విడిచిపోతే గాని మాకు దయ్యం బెడదవదలదు. రేపు లోపల మీరు వెళ్ళిపోకపోతే, మేమే మిమ్మల్ని సాగనంపగలం!" అని హెచ్చరిక చేశారు.

ఇల్లూ, వాకిలీ వదిలేసి ఎక్కడికి వెళ్ళేట్టు? మంగమ్మ తన భర్తతోనే మంచిగా వెళ్ళి పొమ్మని చెప్పటానికి గుండె రాయిచేసుకుని, చీకటి పడ్డాక శ్మశానం కేసి వెళ్ళింది. ఆమెకు నక్కల కూతలు వినిపిస్తున్నాయి. ఆమె మర్రి చెట్టు ప్రాంతానికి రాగానే, చెట్టు కొమ్మల్లో నుంచి, "ఆగవే, ఆగు! నా పెళ్ళాం బిడ్డలకు జరుగుబాటు కావద్దా? నీ దగ్గిర ఉన్నదంతా అక్కడ పెట్టు! నేనెవరను

కున్నావు? వీరయ్యని!" అన్నమాటలు వినిపించాయి.

మంగమ్మ నిర్ఘాంతపోయింది. ఆ గొంతు వీరయ్యది కాదు. ఆమె వెనక్కు తిరిగి ఊరివైపు వచ్చేసింది.

ఆమె ఇల్లు చేరి, జరిగినదంతా రాజయ్యకు చెప్పి, "ఎవడో వెధవ నాన్న పేరు పాడు చేస్తున్నాడు. వాణ్ణి నలుగురికీ పట్టియ్యాలి," అన్నది.

అందుకు రాజయ్య ఉపాయం ఒకటి ఆలోచించి, దాన్ని తల్లికి చెప్పాడు. అందుకు మంగమ్మ సమ్మతించింది.

మర్నాడు మంగమ్మ ఊరివాళ్ళతో, "రేపు ఊరు విడిచి పోతున్నాం," అని చెప్పేసింది.

ఆ రాత్రి తల్లీ కొడుకు లిద్దరూ భోజనం చేశారు. జుట్టుకు తెల్లరంగు పూసుకుంటే రాజయ్య అచ్చుగా వీరయ్య లాగే ఉన్నాడు. ఇద్దరూ శ్మశానం చేరారు. రాజయ్య తెల్లధోవతీ, తెల్లలాల్చీ తొడుక్కుని మర్రిచెట్టు తొర్రలో దాక్కున్నాడు. మంగమ్మ సమీపంలోనే ఒక పొద వెనక నక్కింది.

కొంచెం సేపటికి ఊరివైపు నుంచి ఒక మనిషి తెల్లపంచే, తెల్లలాల్చీ ధరించి వచ్చి, మర్రిచెట్టు ఎక్కి కొమ్మల మధ్య కూర్చున్నాడు. తరవాత వాడు గుడ్లగూబలు కూసినట్టు కూశాడు.

రాజయ్య ఎప్పుడు బయటికి వస్తాడా అని మంగమ్మ తొర్రకేసే చూస్తున్నది.



ఇంతలో అతను రానే వచ్చాడు. వచ్చి, చెట్టు మీద ఉన్న మనిషితో, "దొంగ వెధవా! నా పేరు పాడు చేస్తావా? చూడు, నిన్నేం చేస్తానో! నేనెవరను కున్నావు? వీరయ్యని!" అన్నాడు.

ఆ మాటలకు చెట్టు మీది మనిషి కిందపడ్డాడు. వాడు భయంతో వణికి పోతూ, "తప్పయిపోయింది! క్షమించు, వీరయ్యా!" అని బతిమాలుకున్నాడు.

"నిన్నేమీ చెయ్యను. ఇన్నాళ్లూ దోచిన డబ్బు ఎక్కడ దాచావో చూపించు!" అని వీరయ్య అనేసరికి ఆ మనిషి గజగజ లాడుతూ చెట్టు మొదట్లో తవ్వసాగాడు.

ఈలోపల మంగమ్మ ఊళ్ళోకి వెళ్ళి, "నా మొగుడి పేరు పాడుచేస్తున్న దొంగ వెధవని చూద్దురు గాని రండి!" అని నలుగురినీ వెంట బెట్టుకుని శ్మశానానికి వచ్చింది. నకిలీదయ్యం మనిషి, దీపాలతో వచ్చే మనుషులను చూసి బిత్తర పోయాడు. వాడు తాను దాచిన దొంగ సొమ్మంతా అప్పటికే పైకి తీశాడు.

"దొంగ వెధవా! ఇదా నువు చేసే పని?" అంటూ ఊరివాళ్ళు వాడి మీద పడి చితకతన్నారు.

అప్పుడు చెట్టు తొర్ర లోనుంచి రాజయ్య తొంగి చూసి, "ఏమిటీ గొడవ? ఏం జరిగింది? నాకు కాస్త కునుకు పట్టిందిలే!" అన్నాడు.

మంగమ్మ నిర్ఘాంత పోయింది. ఈ నాటకం ఆడినది రాజయ్య కాకపోతే మరెవరు? ఆమె తనకు తెలిసినదంతా చెప్పిన మీదట, వీరయ్య దయ్యమే నకిలి దయ్యాన్ని పట్టి ఇచ్చినట్టు ఊళ్లోవాళ్ళకు అర్థమయింది. పోయిన సొత్తంతా తిరిగి దొరికింది కూడానూ.

ఊళ్ళోవాళ్ళు మంగమ్మకు క్షమాపణ చెప్పుకుని, ఊళ్ళోనే ఉండమని బతి మాలారు. దయ్యంలాగా నటించినవాడు మాత్రం ఎవరూ చెప్పకుండానే, తెల్లవారే లోపల ఊరు విడిచి వెళ్ళిపోయాడు.

అటుతరవాత వీరయ్య దయ్యాన్ని చూసినవాళ్ళు లేరు.





# శామయ్య ఆత్మ

ఒక ఊళ్ళో శామయ్య అనే సంపన్నుడు ఉండేవాడు. అయనకు భీమయ్య అనే కొడుకు ఉండేవాడు. భీమయ్య తల్లి చని పోయిన చాలా కాలానికి శామయ్య తన ఇంట పనిమనిషిగా ఉండిన చంద్రమ్మను పెళ్ళి చేసుకుని, ఆమెకు ఒక కొడుకును కన్నాడు. ఆ కొడుకు పేరు రాముడు.

శామయ్య రాజుగారి ఖజానాలో గణకుడుగా ఉండి, పెద్దవాడైపోయి పని విరమించుకున్నాడు. తరవాత ఆయన జబ్బు చేసి మంచాన పడ్డాడు. తనకు చావు దగ్గిర పడిందని ఆయనకు తోచింది. అయనకు ఒక్కటే బెంగ పట్టుకున్నది. అదేమంటే, భీమయ్యకు తన తండ్రి చేసుకున్న రెండో పెళ్ళి ఇష్టంలేదు. తాను చచ్చిపోతే అతను చంద్రమ్మనూ, రాముణ్ణీ బీదరికానికి గురి చేస్తాడని శామయ్యకు దిగులు.

అయన భీమయ్యను పిలిచి, "నేను పోయాక చంద్రమ్మనూ, రాముణ్ణీ వీధి పాలు చేసి, నాకు చెడ్డ పేరు తీసుకు రాకు. నేను వయసు మళ్ళినాక మళ్ళీ పెళ్ళి చేసుకోవటం తప్పే. వాళ్ళను నువు పోషించను కూడా వద్దు. తూర్పుదిక్కున ఉన్న ఎకరం మేరబీడూ, అందులో ఉన్న పాడు కొంపా వాళ్ళకు ఇయ్యి, చాలు. వాళ్ళ జీవితం నా మూలంగా భ్రష్టు అయిందన్న అపకీర్తి నాకు రాకుండా చూడు," అన్నాడు.

తండ్రి కోరిన ప్రకారమే చేస్తానని భీమయ్య మాట ఇచ్చాడు.

తరవాత శామయ్య చంద్రమ్మను పిలిచి, అట్ట మీద అంటించిన తన చిత్తరువు ఇస్తూ, "నీ పిల్లవాడికి వయసు రాగానే ఈ బొమ్మను న్యాయాధికారికి చూపించి, ఆ బొమ్మలో ఉన్న రహస్యం

హెచ్. ప్రసాదరావు



ప్రకారం జరిపించమని వేడుకో,'' అని సలహా ఇచ్చి, కన్ను మూశాడు.

శామయ్య పోయేనాటికి రాముడు అయిదేళ్ళ వాడు. వాడికి పన్నెండేళ్ళు వచ్చినదాకా భీమయ్య, చంద్రమ్మనూ, వాణ్ణీ తన ఇంటనే ఉండనిచ్చి పోషించి, తరవాత వాళ్ళను తూర్పు బీడులో ఉన్న పాడుపడిన ఇంటికి పంపేసి, రోజూ వాళ్ళకు ఆహార వస్తువులు లెక్క ప్రకారం పంపనారంభించాడు. ఇదేమిటని అడిగిన వాళ్ళకు అతను, ''వాళ్ళను ఇంత కాలం ఇంట్లో పెట్టుకున్నదే ఎక్కువ. కుర్రవాడు పెరిగాడు; ఏదైనా పని చేసు కుని బతకటం మొదలు పెట్టేదాకా భత్యం ఇస్తాను. నా తండ్రికి ఇచ్చిన మాట ప్రకారం చేస్తాను,'' అంటూ వచ్చాడు.

రాముడు ఆశ్చర్యపడి, ''మే మిద్ద రమూ ఒక తండ్రి బిడ్డలమే గదా! అన్న పట్టుబట్టలు కట్టి, మంచి భోజనం చెయ్యట మేమిటి? నేనూ, నువూ చాలీ చాలని తిండి తింటూ ఈ కూలిపోయే కొంపలో ఉండటమేమిటి?'' అని తల్లిని అడిగాడు.

తల్లి ఏమీ చెప్పలేకపోయింది. రాముడు వెళ్ళి భీమయ్యానే ఈ మాట అడిగాడు.

''ఇలా నువు పెద్దవాడివై, పొగరు బోతు ప్రశ్నలు అడుగుతావనే మా నాన్న నిన్ను ఆ కొంపలో ఉండనియ్యమన్నాడు! ఆయన చెప్పిన ప్రకారమే అంతా చేస్తు న్నాను. సందేహముంటే వెళ్ళి ఆయన్నే అడుగు, పో!'' అన్నాడు భీమయ్య.

చంద్రమ్మ తన భర్త ఇచ్చిన చిత్తరువు తీసింది. అందులో అట్ట మీద అంటించిన శామయ్య చిత్తరువు తప్ప ఇంకేమీ లేదు. ఆమె దాన్ని న్యాయాధికారి దగ్గిరికి తీసుకు పోయి, తన భర్త చనిపోతూ తనకు చెప్పినదంతా చెప్పింది.

ఆయన చిత్తరువును అట్ట నుంచి వేరు చేసి చూశాడు. చిత్తరువు వెనక ఇలా రాసి ఉన్నది:

''న్యాయాధికారిగారికి శామయ్య విన్నపము. నా పెద్ద కొడుకు భీమయ్య,

నా చిన్న కొడుకు రాముడికి భాగం పంచని పక్షంలో, వాణ్ణి కనీసం తూర్పు దిక్కున ఉన్న ఎకరం బీడులో ఉండ నియ్యమన్నాను. రాముడికి వయసు వచ్చినాక ఆ స్థలం మీద భీమయ్యకు ఎలాటి హక్కూ లేనట్టు మీరు సాక్షుల ఎదట రుజువు పరచి, దాన్ని రాముడికి ఇప్పించాలి. ఈ చిత్తరువునే నా ఆత్మగా భావించి, నేను కోరినట్టు చేయించ ప్రార్థన—శామయ్య.''

న్యాయాధిపతి కొంచెంసేపు యోచించిన మీదట, అయిదుగురు పెద్దలను వెంట బెట్టుకుని భీమయ్య ఇంటికి వచ్చి, ''భీమయ్యా, నీ తండ్రి నాకు కనిపించి, నీ యిల్లు గుర్తు చెప్పి పంపగా వచ్చాను. నీకు ఒక తమ్ముడూ, పినతల్లీ ఉన్నారు కాదూ ?'' అని అడిగాడు.

'' అవును, ఉన్నారు. నా తండ్రి కోరిన ప్రకారం తూర్పు దిక్కున ఉన్న ఎకరం బీడులో వాళ్ళను ఉండనిచ్చానే ?'' అన్నాడు భీమయ్య.

'' అది బాగానే ఉన్నది. కాని నువు ఇష్టమైతే వాళ్ళకు న్యాయంగా తన ఆస్తిలో సగం ఇవ్వవచ్చుననీ, అలా కాని పక్షంలో ఆ బీడు అయినా లిఖిత పూర్వకంగా ఇస్తే మంచిదనీ నీ తండ్రి అంటున్నాడు,'' అన్నాడు న్యాయాధికారి.

'' ఇప్పుడు వాళ్ళు ఉంటున్న ఎకరం బీడు, ఇంటితో సహా రాసి ఇస్తాను. అంత కన్న ఇంకేమీ ఇయ్యను,'' అన్నాడు భీమయ్య.

భీమయ్య చేత న్యాయాధిపతి పత్రం రాయించి, ఆ ఎకరం బీడులోనూ, పాడుపడిన ఇంటి మీదా అతనికి ఏ హక్కులూ లేవనీ, ఆ ఆస్తి మీద సర్వహక్కులూ రాముడివేననీ ఒప్పించాడు.

తరవాత న్యాయాధికారి ఆ పెద్ద మనుషుల ఎదటనే ఇంటిగోడలు పడ గొట్టగా అందులో శామయ్య దాచిన వెండి, బంగారాలు బయటపడ్డాయి. వాటితో చంద్రమ్మా, రాముడూ సుఖంగా జీవించారు.





# అసలుకే మోసం

ఒక గ్రామంలో కామమ్మ అనే ఆమెకు ఆరేళ్ళ కొడుకు ఉండేవాడు. వాడు ఒకనాడు ఆడుకోవటానికి పోతుంటే వీధిలో ఏదో తళుక్కున మెరిసింది. అది ఒక ఉంగరం. కుర్రవాడు దాన్ని తీసుకుని ఇంటి కేసి పరిగెత్తాడు.

సమీపంలోనే వీధి అరుగు మీద కూర్చుని ఉన్న రామయ్య అనే ఆయన, కుర్రాడు వంగటమూ, దేన్నో తీసుకుని పరిగెత్తటమూ చూసి, కుర్రవాణ్ణి ఆపి, "ఏమిట్రా నీ చేతిలో? పరిగెత్తుతున్నా వెందుకూ?" అని అడిగాడు.

కుర్రాడు చెయ్యి విప్పి ఉంగరం చూపించి, అది తనకు దొరికిందన్నాడు.

"ఒరే, నీ కెందుకు? అది నా కిచ్చి, ఈ కానీ తీసుకుపోయి, ఏమన్నా కొనుక్కు తిను," అంటూ రామయ్య కుర్రాడి నుంచి ఉంగరం తీసుకుని, వాడి చేతిలో ఒక కానీ పెట్టాడు. కుర్రాడు ఉత్సాహంగా ఆ కానీతో తినుబండారం కొని ఇల్లు చేరుకున్నాడు.

"ఎక్కడిదిరా అదీ? ఎవరిచ్చారురా?" అని తల్లి వాణ్ణి అడిగింది.

"కొనుక్కున్నాను," అన్నాడు వాడు.

"డబ్బులెక్కడివిరా నీకూ?" అన్నది తల్లి.

"పక్కింటి రామయ్య కానీ ఇచ్చాడు," అన్నాడు కొడుకు.

"వెధవా, ఊళ్ళో వాళ్ళనందర్నీ డబ్బుల కోసం దేబిరిస్తున్నావా?" అని తల్లి కోప్పడింది.

"నేనేమీ దేబిరించలేదు. ఉంగరం తీసుకుని కానీ ఇచ్చాడు," అన్నాడు కొడుకు.

"ఉంగరమేమిట్రా, వెధవా?" అని తల్లి వాణ్ణి కసిరింది.

గంగిశెట్టి శివకుమార్

కుర్రాడు బిక్కమొహం వేసుకుని జరిగినదంతా తల్లికి చెప్పాడు.

కామమ్మకు రామయ్య మీద మండు కొచ్చింది. ఆమె బయటికి వచ్చి, రామయ్యతో, "ఏమయ్యా, ఏమిటీ బుద్ధి లేని పనులు? ఎంతో కష్టపడి డబ్బు కూడ బెట్టి, కుర్రాడికి ముచ్చటగా ఉంగరం చేయిస్తే, వాడి చేతిలో కానీ పెట్టి, దాన్ని కాజేస్తావా?" అంటూ జగడానికి దిగింది.

"ఏమిటి, అక్కగారూ? ఉంగర మేమిటి? నేను కాజెయ్యటమేమిటి? ఏదో పిల్లవాడు గదా అని ఒక కానీ ఇచ్చాను. అంతకన్న నాకింకేమీ తెలీదు," అన్నాడు రామయ్య.

కామమ్మ అంత తేలికగా ఊరుకునే రకం కాదు. ఆమె నోటికి వచ్చినట్టు మాట్లాడటం మొదలు పెట్టేసరికి నలుగురూ పోగయారు.

ఇంతలో ఒక పెద్దమనిషి జేబులు తడుముకుంటూ అటుగా వచ్చి, "ఇంతకు ముందు నేను ఇటుగా పోతూ ఉంగరం ఒకటి పోగొట్టుకున్నాను. మీలో ఎవరి కన్నా దొరికితే ఇచ్చేస్తారా?" అని వేడుకున్నాడు.

అక్కడ చేరిన వారికి, కామమ్మా, రామయ్యా ఎందుకు పోట్లాడుకుంటున్నారో అర్థమైపోయింది. వాళ్ళు అసలు



విషయం ఆ వచ్చిన పెద్దమనిషి చెవిలో వేశారు.

ఆయన పోట్లాడుతున్న వాళ్ళతో, "ఏం మనుషులు మీరు? ఎవరి సొత్తుకో ఆశ పడి పోట్లాడుకుంటున్నారా? ఆ ఉంగరం నాది. దాన్ని నాకు ఇచ్చేసి తగవు మానండి," అన్నాడు.

కామమ్మా, రామయ్యా ఒకరి మొహం ఒకరు చూసుకుని, వెంటనే మాట మార్చేశారు.

"పోవయ్యా, పెద్ద మనిషీ! మేమేదో పిల్లల విషయమై తగాదా పడుతూంటే, మధ్యలో పానకంలో పుడకలాగా నువ్వేమిటి! నీ ఉంగరం ఇక్కడ ఎవరికీ



దొరకలేదు. వెళ్ళు, వెళ్ళు!'' అన్నారు వాళ్ళు కోపంగా.

వచ్చినవాడు గట్టిపిండం, "ఇదా మీ ఎత్తు? రండి గ్రామాధికారి దగ్గిరికి," అన్నాడు.

గ్రామాధికారి అనగానే ఇద్దరి గుండెల్లో రాయి పడింది. అయినా ఉంగరం వదులుకోవటం ఇష్టం లేక, వాళ్ళు పెద్ద మనిషి వెంట గ్రామాధికారి వద్దకు వెళ్ళారు.

ఆ గ్రామాధికారి ఊరికి న్యాయాధికారి కూడానూ. అతను లంచాలు మరిగి, చాలాకాలంగా పక్షపాతపు తీర్పులు చెబుతూ వస్తున్నాడు. అయినా అతని మీద రాజుగారికి ఫిర్యాదు చెయ్యటానికి గ్రామస్థులలో ఎవరికీ ధైర్యం లేదు.

పెద్దమనిషి గ్రామాధికారితో తన ఉంగరం సంగతి చెప్పాడు. కామమ్మా, రామయ్యా తమకు ఆ ఉంగరం సంగతి తెలీదనీ, ఆ పెద్దమనిషి తమను నిష్కారణంగా అల్లరి పెడుతున్నాడనీ అన్నారు. కాని, గ్రామాధికారి కూడా మోసగాడే గనక, మోసం పసిగట్టి, అడ్డదిడ్డంగా ప్రశ్నలు వేసి, కామమ్మ చేతా, రామయ్య చేతా నిజం చెప్పించేశాడు. చెరి ఇరవై వరహాలూ జరిమానా కట్టుకుని, ఉంగరాన్ని గ్రామాధికారికిచ్చి, కామమ్మా, రామయ్యా వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే, పెద్దమనిషి గ్రామాధికారితో, "అయ్యా, తమరు నాకెంతో సహాయం చేశారు. నా ఉంగరం నాకు ఇచ్చేశారంటే, నా దారిన నేను పోతాను," అన్నాడు.

గ్రామాధికారి నవ్వి, "అంత తొందర పడితే ఎలాగయ్యా? ఈ ఉంగరం నువు తీసుకుపోయి, రేపు మరొకడు వచ్చి ఈ ఉంగరం తనదంటే నేనేం చెయ్యాలి? నమ్మదగ్గ రుజువు ఏదన్నా చూపి, నిరభ్యంతరంగా ఉంగరం తీసుకు వెళ్ళు. అంతదాకా ఇది నా వద్ద ఉంటుంది," అన్నాడు.

చేసేదిలేక పెద్దమనిషి తల వేలాడ వేసుకుని వెళ్లిపోయాడు.

ఆ రోజు రాత్రి గ్రామాధికారి కంసాలి భద్రయ్య ఇంటికి వెళ్ళి, "చూడు, భద్రయ్యా, అత్యవసరంగా డబ్బు కావలసి వచ్చింది. అప్పుచెయ్యటం మనకు ఇంటా, వంటా లేదు. నా భార్య చేతి ఉంగరం తెచ్చాను. దానికి ఖరీదు కట్టి ఇయ్యి," అన్నాడు ఉంగరాన్ని భద్రయ్య కిస్తూ.

భద్రయ్య దాన్ని అటూ, ఇటూ తిప్పి చూసి, "ఈ ఉంగరం నాలుగువందల వరహాలు చేస్తుంది. నా దగ్గిర ఇప్పుడు రెండువందల పైన లేదు. దీన్ని మరెవరి వద్ద కన్నా తీసుకుపొండి," అన్నాడు.



ఈ విషయం ఇంకొకరికి కూడా తెలియటం దేనికని, గ్రామాధికారి భద్రయ్యతో, "ఫరవాలేదులే, భద్రయ్యా. నీ దగ్గిర ఉన్నంత ఇప్పుడు ఇయ్యి. మిగతాది రేపు సాయంత్రానికి సర్దితే చాలు," అన్నాడు.

భద్రయ్య రెండు వందల వరహాలు తెచ్చి ఇచ్చాడు. గ్రామాధికారి డబ్బు తీసుకుంటూ, "భద్రయ్యా, ఈ సంగతి ఎక్కడా చెప్పకు," అన్నాడు.

మర్నాడు సాయంత్రం గ్రామాధికారి భద్రయ్య ఇంటికి వచ్చి మిగతా డబ్బు అడిగాడు.

"డబ్బా, నేను మీ కేం డబ్బు ఇయ్యాలి? దేనికియియ్యాలి?" అన్నాడు భద్రయ్య.

"భద్రయ్యా, నన్ను మోసం చెయ్యజూడకు. రాజుగారితో చెప్పి, నీ తల తీయించెయ్యగలను," అని గ్రామాధికారి బెదిరించాడు.

భద్రయ్య భయపడలేదు. అతను గ్రామాధికారి వెంట రాజుగారి సభకు వెళ్ళి, రాజు సమక్షంలో గ్రామాధికారి చెప్పిన దాంట్లో అబద్ధంలేదనీ అంతా నిజమేననీ ఒప్పుకున్నాడు.

రాజు భద్రయ్యకు పెద్ద జరిమానా విధించాడు.

"మోసగాళ్ళందరికీ మీరు జరిమానా విధిస్తున్నట్టయితే గ్రామాధికారిగారికి కూడా విధించండి," అన్నాడు భద్రయ్య.

"గ్రామాధికారి ఏం మోసం చేశాడు?" అని రాజు ఆశ్చర్యంగా అడిగాడు.

భద్రయ్య ఆ ఉంగరం గురించి ఊళ్ళో జరిగినదంతా రాజుకు చెప్పాడు. అన్నీ అబద్ధాలేనన్నాడు గ్రామాధికారి.

అప్పుడు భద్రయ్య ఇలా చెప్పాడు:

"ఆ ఉంగరాన్ని నేను ఒక రాజోద్యోగి కోసం చేసి యిచ్చాను. అది నకిలీ ఉంగరం. ఆయన నా దగ్గిరికి వచ్చి, తన భార్య వజ్రపుటుంగరం కోసం పోరు పెట్టుతున్నదనీ, తనకు అంతస్తోమత లేదనీ అన్నాడు. నేను ఆయనకు చౌకలో ఒక నకిలీ ఉంగరం చేసి ఇచ్చాను. దాన్ని ఆయన తీసుకుపోతూ దారిలో పోగొట్టుకున్నాడు. దాన్ని మోసం చేసి ఈ గ్రామాధికారి చేజిక్కించుకున్నాడు. నేను చెప్పిన రాజోద్యోగి ఇప్పుడు ఈ సభలో ఉన్నాడు."

భద్రయ్య ఈ మాట అనగానే ఒక రాజోద్యోగి లేచి, భద్రయ్య మాట నిజమని ఒప్పుకున్నాడు. రాజుకు గ్రామాధికారి మీద అమితమైన కోపం వచ్చింది. ఆయన భద్రయ్యతో, "గ్రామాధికారితో పాటు, నువు కూడా మోసకారివే గదా!" అన్నాడు.

భద్రయ్య నవ్వి, "మహారాజా, మా గ్రామాధికారి ఇలాటి మోసాలూ, అక్రమమైన తీర్పులూ చాలా కాలంగా చేస్తున్నాడు. ఇప్పుడు వాటిని బయట పెట్టే అవకాశం వచ్చింది గనక ఇలా నాటకం ఆడాను. నేను మోసగాణ్ణే అయితే నకిలీ ఉంగరానికి రెండువందల వరహాలు ఇస్తానా?" అన్నాడు.

ఈ మాట రాజుకు నచ్చింది. ఆయన భద్రయ్య తెలివిని ఎంతో మెచ్చుకుని, గ్రామాధికారి చేత భద్రయ్యకు వెయ్యి వరహాలు ఇప్పించి, గ్రామాధికారిని పదవి నుంచి తొలగించటమే గాక, కఠినశిక్ష కూడా అతనికి విధించాడు.





# చలించని మనస్సు

ఒక ఊళ్ళో ఈశ్వరయ్య అనే సాధారణ కుటుంబీకుడు ఉండేవాడు. వయసు మళ్ళే నాటికి అతను జీవితంలో కష్ట సుఖాలను అన్నిటినీ చూశాడు. అతనికి సంసారం మీద విరక్తి కలిగింది; బంధా లన్నిటినీ తెంచుకుని, కాశీకి వెళ్ళి విశ్వే శ్వరుణ్ణి సందర్శించి, తరించాలని నిశ్చ యించుకున్నాడు. అతను ఒక మంచి రోజు చూసి కాశీ యాత్రకు బయలు దేరాడు.

దారిలో ఈశ్వరయ్యకు మరి ముగ్గురు యాత్రికులు తారసపడ్డారు. వాళ్ల ముగ్గు రిదీ ఒకే ఊరు. ఒకడు పర్వతయ్య అనే నగల వర్తకుడు. అతను వ్యాపారంలో లక్షలు గడించి, పొలాలూ, ఇళ్ళూ కొన్నాడు. కాని శాంతి పొందలేక, ఇంత పుణ్యం మూట కట్టుకుందామని కాశీ యాత్ర చేస్తున్నాడు.

మిగిలిన ఇద్దరూ అన్నదమ్ములు. పెద్ద వాడు చంద్రయ్య డబ్బు సంపాదించ టానికీ, చిన్నవాడు సూరయ్య విద్య సంపాదించటానికీ కాశీకి పోతున్నారు.

నలుగురూ కలిసి కొన్ని రోజులు ప్రయాణం చేసి అరణ్యప్రాంతం ప్రవే శించారు. ఆ అరణ్యంలో కొంతదూరం వెళ్లాక, వాళ్లకు ఒక పొదలో తళుక్కున మెరుస్తూ ఒక వజ్రం కనిపించింది. దాని చుట్టూ మనిషి పుర్రే, ఎముకలూ ఉన్నాయి.

దాన్ని చూడగానే ఈశ్వరయ్యకు తప్ప మిగిలిన ముగ్గురికీ కళ్లు మెరిశాయి. వాళ్లు ఒక్క పరుగున పొద దగ్గిరికి వెళ్ళారు. నగల వర్తకుడు పర్వతయ్య వజ్రాన్ని తన చేతిలోకి తీసుకుని, పరిశీలించి, "ఇది అసాధారణమైన వజ్రం. దీని విలువ లక్షలలో ఉంటుంది. ఈ వజ్రం

వీరేపల్లి జయరాంరెడ్డి



గల వాణ్ణి ఏ పులో చంపేసినట్టు కనబడు తుంది,'' అన్నాడు.

వజ్రం విలువ తెలియగానే ఆ ముగ్గురి ఆశయాలు గాలికి ఎగిరిపోయాయి.

చంద్రయ్య ఇలా అనుకున్నాడు:

''ఆ వజ్రంలో నలుగురికీ వాటా ఉంటుంది. దాని ఖరీదులో నాలుగో వంతు నాకు వస్తుంది. ఆ డబ్బుతో నేను ఇంటి దగ్గిరే వ్యాపారం చేసుకోవచ్చు. వ్యాపారం కోసం కాశీ దాకా వెళ్ళటం దేనికి?''

సూరయ్య ఇలా అనుకున్నాడు:

''కాశీ దాకా వెళ్ళి చదువుకున్నా, చివరకు సంపాదనే గదా నా లక్ష్యం? ఈ వజ్రం విలువలో నాకు వచ్చే భాగంతో అన్నతో కలిసి వ్యాపారం చేస్తే చాలా లాభం ఉంటుంది. ఏ గురుపీఠం దొరికినా అంత డబ్బు రాదు.''

ఇక పర్వతయ్య పుణ్యం మాటేమరిచి, ఇలా అనుకున్నాడు:

''ఈ వజ్రాన్ని సరసమైన ధరకు నేనే కొనేసుకుంటే, దాన్ని తగిన వాడికి అమ్మి ఎంతో లాభం పొందగలుగుతాను."

వజ్రాన్ని చూసి చలించని వాడు ఈశ్వరయ్య ఒక్కడే. దుర్మరణం పొందిన మనిషి ఎముకల మధ్య కనిపించిన ఆ వజ్రం అతనిలో కొంత అసహ్యం కూడా కలిగించింది, అయినా అతను, మిగిలిన ముగ్గురూ ఏం చేసినా దానికి ఒప్పుకుందామనుకున్నాడు.

దగ్గిరలో ఏదైనా పట్టణం ఉంటే, అక్కడ వజ్రానికి వెల కట్టింతామని వాళ్ళు అనుకున్నారు. అందరిలోకీ చిన్న వాడైన సూరయ్య ఒక పెద్ద మర్రి చెట్టు ఎక్కి చుట్టూ కలయ జూసి, దిగి వచ్చి, కనుచూపు మేరలో ఒక్క పల్లె కూడా లేదని చెప్పాడు.

చీకటి ముంచుకు వస్తూ ఉండటం చేత నలుగురూ ఆ చెట్టు కిందనే మజిలీ చేశారు. వాళ్లు వజ్రాన్ని ఆ చెట్టుతొర్రలో ఉంచి, చెట్టు మొదట్లో ఎండు పుల్లలతో

పెద్ద మంట చేసి, క్రూరజంతువులు రాకుండా తెల్లవార్లూ కాపలా కాయటానికి తమలో తాము వంతులు వేసుకున్నారు.

తెల్లవారి మిగిలిన వాళ్ళు లేచేసరికి సూరయ్య లేడు. చెట్టుతొర్రలో వజ్రమూ లేదు. అతను వజ్రం తీసుకుని పారిపోయాడు. చేసేదిలేక మిగిలిన ముగ్గురూ తమ ప్రయాణం సాగించారు.

వాళ్ళు కొంతదూరం పోయేసరికి వాళ్ళకు సూరయ్య శవం కనిపించింది. అతని శరీరం నల్లగా కమిరిపోయింది. నోటి వెంట నురుగు వస్తున్నది. చేతిలో వజ్రం మెరుస్తున్నది.

తమ్ముడి శవాన్ని చూసి చంద్రయ్య కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ, "బతికి ఉంటే బాగా చదువుకుని ఏ పీఠాధిపతో కావలసిన వాడు! వాడి వక్రబుద్ధే వాణ్ణి పాము రూపంలో కాటేసింది," అన్నాడు.

పర్వతయ్య చంద్రయ్యను ఓదార్చాడు. సూరయ్య శవాన్ని చూసి ఈశ్వరయ్య గడగడ వణికిపోయాడు. వజ్రాన్ని చూస్తేనే అతనికి కంపరం ఎత్తింది.

ముగ్గురూ సూరయ్య శవాన్ని దహనం చేసి, ప్రయాణం సాగించి ఒక పెద్ద పట్నం చేరుకుని, పట్నం శివార్లలో ఉన్న ఒక సత్రంలో రాత్రికి బస చేశారు. ఈశ్వరయ్య ఒక గదీ, మిగిలిన ఇద్దరూ మరొక గదీ తీసుకున్నారు. ఈశ్వరయ్య ఏకాంతంగా ఉండగోరి వేరే గది తీసుకున్నాడు. తెల్లవారిన తరువాత తనకు



వజ్రంలో వాటా అవసరం లేదని మిగిలిన ఇద్దరితో చెప్పటానికి అతను నిశ్చయించుకున్నాడు

ఆ రాత్రి పర్వతయ్యా, చంద్రయ్యా తమ వద్ద ఉన్న వజ్రాన్ని చూసుకుని మురిసిపోతూ, అందులో ఈశ్వరయ్యకు వాటా లేకుండా చెయ్యటానికి వాళ్ళు తెల్లవారే లోపుగా అతనితో చెప్పకుండా పారిపోవాలని నిశ్చయించుకున్నారు. తలుపు సందుల్లో నుంచి ఎవరివో కళ్ళు తమ వజ్రాన్ని చూస్తున్న సంగతి వారికి తెలీదు.

తెల్లవారుతూనే ఈశ్వరయ్య నిద్రలేచి, తన నిర్ణయాన్ని తన మిత్రులకు తెలియజేయటానికి వాళ్ల గదికి వెళ్ళాడు. గదిలో ఇద్దరూ చచ్చిపడి ఉన్నారు! వజ్రం కోసం గది అంతా చూశాడు. అది కనిపించలేదు. ఆ వజ్రం కోసం ఎవరో వాళ్ళను హత్యచేశారు. వజ్రం మీద ఈశ్వరయ్యకు మరింత అసహ్యం పుట్టింది.

ఈశ్వరయ్య ఒంటరిగా కాశీకి బయలుదేరాడు. పట్నం దాటగానే అతనికి యాత్రకు వెళ్ళే బైరాగుల బృందం ఒకటి కనబడింది. బారెడేసి గడ్డాల తోనూ, జడలు గట్టిన జుట్టుతోనూ, నుదుట విభూతి రేఖలతోనూ, రుద్రాక్ష మాలల తోనూ, ఆ బైరాగులు ఈశ్వరయ్య దృష్టికి ఎంతో శాంతస్వరూపుల లాగా కనిపించారు. ఈశ్వరయ్య వాళ్ళతో కలిసిన క్షణం నుంచీ అతని మనస్సు దృఢంగా భగవంతుడి మీద లగ్నమయింది.

ప్రయాణం ఉల్లాసంగా సాగటానికి బైరాగులు రకరకాల పాటలు పాడుతున్నారు, నృత్యం చేస్తూ నడుస్తున్నారు. వాళ్ళతో కలిసి నడుస్తున్న ఈశ్వరయ్యకు ఒక పొదలో ఏదో తళతళా మెరుస్తూ కనబడింది. దాని చుట్టూ ఒక పుర్రే, కొన్ని ఎముకలూ ఉన్నాయి. వెంటనే ఈశ్వరయ్య చటుక్కున మొహం తిప్పుకుని, చరచరా ముందుకు సాగి, బైరాగులను చేరుకుని, వాళ్ళతోపాటు నడిచిపోయాడు.





# వీర హనుమాన్

స్వయంప్రభ ధర్మమా అంటూ బిలం నుంచి బయటపడిన వానరులకు ఎట్టెదట సముద్రం, పెద్ద పెద్ద కెరటాలతో ఘోషపెట్టుతూ, కంటపడింది. వాళ్ళు వింధ్యపర్వతపు నైరృతి ప్రాంతంలో పుష్పవృక్షాల కింద ఒక తిప్ప మీద చేరి ఆలోచన చేశారు; ఎందుకంటే, సుగ్రీవుడు పెట్టిన గడువు దాటిపోయింది. వాళ్ళు సుగ్రీవుడి ఆగ్రహానికి చాలా భయపడ్డారు.

ఆ స్థితిలో, యువరాజైన అంగదుడు మిగిలిన వానరులతో ఇలా అన్నాడు:

''వానరులారా, మనను పంపిన సుగ్రీవుడు మనకు నియమించిన నెల గడువు, మనం ఋక్షబిలంలో ఉండగానే తీరిపోయిన సంగతి మీకు తెలుసుగదా? మొట్టమొదట, హనుమంతుడి సూచన మీద సుగ్రీవుడు మనకు పదిహేను రోజులు గడువు ఇచ్చి పిలిపించాడు. ఇది అశ్వయుజ మాసంలో జరిగింది. తరవాత లక్ష్మణుడు కోపించి వచ్చిన మీదట మళ్ళీ పదిరోజులు గడువిచ్చి సుగ్రీవుడు మనలనందరినీ పిలిపించాడు. తరవాత మనకు తిరిగి రావటానికి ఒక్క మాసం గడువు ఇచ్చాడు. ఆ గడువు తీరిపోయింది. ఇప్పుడు మనం ఏం చెయ్యాలో ఆలోచించండి. మనకేమో సీత జాడ ఇంకా తెలియలేదు. మనం సుగ్రీవుడి ఆజ్ఞను రెండు విధాలా ఉల్లంఘించాం. అమిత క్రూర స్వభావుడైన సుగ్రీవుడు

## 9. సంపాతి కథ



తెలుసుకో గలిగితే సుగ్రీవుడి వద్దకు పోదాం. లేకపోతే ఇక్కడే చచ్చిపోదాం,'' అన్నారు.

''మనం చావటం దేనికి? ఈ బిలం లోకి వెళ్ళి, అక్కడ హాయిగా ఉందాం. విచారించకండి. ఈ బిలంలోకి ఎవరూ రాలేరు. ఇక్కడ తినటానికీ, తాగటానికీ పుష్కలంగా వున్నది. ఇక్కడ మనకు రాముడి భయంగానీ, సుగ్రీవుడి భయం గానీ లేదు,'' అన్నాడు తారుడు.

ఈ మాటలన్నీ వింటున్న హను మంతుడు తనలో, ''సుగ్రీవుడి వానర రాజ్యాన్ని అంగదుడు తప్పక కాజేస్తాడు. ఈ వాలి కొడుకు సూక్ష్మబుద్ధి గలవాడు, దేశ కాలాలు తెలిసినవాడు,'' అను కున్నాడు.

మనను తప్పక చంపేస్తాడు. మనం అక్కడికి తిరిగి వెళ్ళి, భయంకరంగా చావటం కన్న, ఇక్కడే ప్రాయోపవేశం చేసి, ప్రాణాలు విడవటం మంచిది. సుగ్రీవుడికి నా మీద సద్భావం లేదు. నన్ను యువరాజును చేసిన వాడు రాముడేగాని సుగ్రీవుడు కాడు. అందు చేత నెపం దొరికితే ఆయన నన్ను చంపక మానడు. అయిన వాళ్ళందరికీ దుఃఖం కలిగేటట్టుగా నేను కిష్కింధలో ఎందుకు చావాలి? ఇక్కడ నిరశన వ్రతం అవలం బించి, ఈ సముద్ర తీరాన చచ్చిపోతాను."

ఈ మాటలకు వానర వీరులంతా దుఃఖించి, ''మనం సీత సమాచారం

అతను అంగదుడితో, ''అంగదుడా, నువు యుద్ధంలో నీ తండ్రికన్న గొప్ప వాడివి కావు. చపలచిత్తులైన ఈ వానరులు ఎల్లప్పుడూ నీ వెంట ఉండరు. వాళ్ళకు భార్యలూ, బిడ్డలూ ఉన్నారు. నన్నూ, ఈ జాంబవంతుణ్ణీ, ఇతర వానర వీరు లనూ సుగ్రీవుడి నుంచి వేరుచేసి నీ పక్షం చేసుకోవటం నీకు సాధ్యం కాదు. ఈ ఋక్ష బిలం లక్ష్మణుడి బాణాలకు గొప్ప ప్రతి బంధకం కాదు; అతను దీన్ని ఆకును ఛేదించినట్టు ఛేదిసాడు. అసలు నువు

సుగ్రీవుడి మీద విరోధం కట్టి ఈ బిలంలో ప్రవేశిస్తే, ఈ వానరులు నిన్ను విడిచి పెట్టేస్తారు. తరవాత నువు గడ్డిపోచ విలువ చెయ్యవు. రామలక్ష్మణులు నిన్ను ప్రాణాలతో వదలరు. సుగ్రీవుడు ధర్మాత్ముడు. అతనికి నీ పైన పగలేదు. పైపెచ్చు నీ తల్లి అంటే చాలా ప్రేమ గలవాడు. ఆమె కొడుకువైన నిన్ను తన కొడుకులాగే చూసుకుంటాడు," అన్నాడు.



హనుమంతుడి మాటలను అంగదుడు ఆమోదించక, "సుగ్రీవుడిలో ఏ సుగుణమూ లేదు. తన అన్న తనను గుహ వద్ద కాపు పెట్టి, శత్రువు బయటికి రాకుండా చూడమని చెప్పి లోపలికిపోతే, సుగ్రీవుడు దుర్బుద్ధితో గుహకు రాయి అడ్డం పెట్టాడు. రాముడివల్ల అంత ఉపకారం పొంది, ప్రత్యుపకారం చెయ్యటం మాట మరిచాడు. చివరకు అతను సీతను వెదికిస్తున్నది కూడా లక్ష్మణుడికి భయపడే గాని, సద్బుద్ధితో కాదు. అలాటి వాడికి, నేను ఇప్పుడు అందరికీ తెలిసినట్టు చేసిన ఆలోచన తెలిసిన మీదట ప్రాణాలతో ఉండగలనా? నేను కిష్కింధకు రాను. ఇక్కడే ప్రాయోపవేశం చేసాను. మీరంతా కిష్కింధకు తిరిగి వెళ్ళండి. రామలక్ష్మణుల క్షేమం అడిగానని చెప్పండి," అన్నాడు.

అంగదుడు ఇలా అని, తన తల్లి అయిన తారను తలుచుకుని దుఃఖిస్తూ, నేల మీద దర్భలు పరుచుకుని, వాటి మీద పడుకున్నాడు. అది చూసి వానరులందరూ పెద్దగా ఏడ్చారు. అంగదుడి నిశ్చయం మారదని గ్రహించి, వాళ్ళందరూ సముద్రంలో స్నానాలు చేసి, దర్భలు పరుచుకుని, వాటి మీద తాము కూడా పడుకున్నారు. తరవాత వాళ్ళు తమలో తాము రాముడి వనవాసం గురించీ, సీతాపహరణం గురించీ, జటాయు మరణం గురించీ, వాలి వధ గురించీ, తమ సీతాన్వేషణ గురించీ మాట్లాడుకోసాగారు.



వానరుల కోలాహలం విని, ఒక గుహ నుంచి పెద్ద గద్ద ఒకటి బయటికి వచ్చి, ''ఆహా, నాకు కడుపు నిండా కావలసినంత తిండి!'' అన్నది. ఆ మాట విని వానరులు హడలిపోయారు.

అంగదుడు హనుమంతుడితో, "ఈ గద్ద సూర్యుడి కొడుకైన సంపాతి. రాముడి కోసం జటాయువు రావణుడితో యుద్ధం చేసి ఎలా ప్రాణాలు వదిలినదీ మనకు తెలుసు గదా. మనం అలా రామ కార్యంలో ప్రాణాలు పోగొట్టుకున్న వాళ్ల మైనా కాలేకపోయాం,'' అన్నాడు.

ఈ మాటలు విని సంపాతి గట్టిగా, ''నా తమ్ముడైన జటాయువు చచ్చాడని చెప్పి నా మనస్సుకు బాధ కలిగిస్తున్న వాడెవడు? జటాయువుకూ, రావణుడికీ యుద్ధం ఎందుకు జరిగింది? చాలా కాలానికి జటాయువు పేరు వింటు న్నాను,'' అని అరిచాడు.

తరవాత అతను వానరులతో, ''వానరు లారా, సూర్యుడి కిరణాలకు నా రెక్కలు కాలిపోయాయి. ఈ పర్వతం మీద నుంచి నేను దిగి రాలేను. నన్ను కిందికి దింపండి,'' అన్నాడు.

తమను తింటానన్న సంపాతి మాటలు వానరులు నమ్మలేకపోయారు. కాని, తాము ఎలాగూ చచ్చిపోవటానికే నిశ్చ యించుకున్నప్పుడు సంపాతి తింటాడని భయపడటం అనవసరమనుకున్నారు.

అంగదుడు కొండ మీదికి వెళ్ళి, సంపాతిని కిందికి తెచ్చి, అతనికి జరిగిన దంతా ఇలా చెప్పాడు:

''ఇక్ష్వాకువంశపు రాజైన దశరథుడి కొడుకు రాముడు తండ్రి మాట శిరసా వహించి, తమ్ముడు లక్ష్మణుణ్ణీ, భార్య సీతనూ వెంటబెట్టుకుని దండకారణ్యానికి వచ్చాడు. అతను జనస్థానంలో ఉండగా రావణుడు సీతను బలాత్కారంగా ఎత్తుకు పోయాడు. రావణుడు ఆకాశమార్గాన పోతూండగా, దశరథుడికి మిత్రుడైన జటాయువు చూశాడు. జటాయువు

రావణుడితో యుద్ధం చేసి, కొంతసేపు సీతను కాపాడి, చివరకు చనిపోయాడు. రాముడు జటాయువుకు సంస్కారం చేసి, మా ప్రాంతానికి వచ్చి, మా పినతండ్రి అయిన సుగ్రీవుడితో స్నేహం చేసి, నా తండ్రి అయిన వాలిని చంపి, సుగ్రీవుణ్ణి వానర రాజును చేశాడు. ఆ సుగ్రీవుడి ఆజ్ఞ మీదనే మేం సీత కోసం వెతుకుతూ ఇలా వచ్చాం. మాకు సీత జాడ తెలియలేదు. మేం వెనక్కు తిరిగిపోతే నిశ్చయంగా రాముడి చేతనో, సుగ్రీవుడి చేతనో మరణం పొందుతాం,'' అన్నాడు.



సంపాతి పెద్ద గొంతుతో, ''వానరులారా, మీరు, రావణుడితో యుద్ధం చేసి చనిపోయాడని చెప్పే జటాయువు నా తమ్ముడు. ముసలివాణ్ణి; రెక్కలు లేనివాణ్ణి; రావణుణ్ణి చంపి పగ తీర్చుకోలేను. ఏం చెయ్యను? వృత్రాసురుడి వధ జరిగిన రోజుల్లో, అన్నదమ్ములిద్దరమూ పోటీపడి ఎగిరిపోతూ, సూర్యుడికి సమీపంగా వెళ్ళాం. సూర్యుడు నడినెత్తికి వచ్చేసరికి జటాయువు ఎండ దెబ్బ తిన్నాడు. అప్పుడు నేను వాడికి ఎండ తగలకుండా నా రెక్కలు అడ్డం పెట్టాను. ఆ కారణంగా నా రెక్కలు కాలాయి. నేను వింధ్యపర్వతం మీద పడ్డాను. అది మొదలు నేను ఇక్కడే ఉంటున్నాను. నా తమ్ముడి సమాచారం తెలియరాలేదు,'' అన్నాడు.

ఈ మాట విని అంగదుడు సంపాతిని, ''ఆ రాకస రాజైన రావణుడు ఎక్కడ ఉంటాడో తెలుసునా?'' అని అడిగాడు.

''నాయనలారా, ఆ రావణుడు ఒక అందమైన స్త్రీని తీసుకుపోవటం నేను స్వయంగా ఎరుగుదును. ఆమె తన్నుకోవటం నాకు తెలుసు. ఆమె 'రామా, రామా', అని కేకలు పెట్టటాన్ని బట్టి సీతే అయి ఉండాలి. ఇక రావణుడు లంక అనే నగరంలో ఉంటాడు. అతను విశ్రవసుడి కొడుకు; కుబేరుడి తమ్ముడు.



సముద్రం మధ్య ఇక్కడికి నూరు యోజనాల దూరంలో ఒక ద్వీపం మీద లంకా నగరం ఉన్నది. మీరు సముద్రం దాటి లంకా నగరం చేరారంటే మీకు అక్కడ రావణుడూ, సీతా కూడా కనిపించవచ్చు. మీరు రాముడి చేత ఆ రావణుణ్ణి చంపించారంటే నా పగ తీరుతుంది. మీరు సముద్రం దాటే మార్గంచూడండి,'' అన్నాడు సంపాతి.

తరవాత వానరులు తనను సముద్ర తీరానికి చేర్చగా, సంపాతి తన తమ్ముడైన జటాయువుకు జలతర్పణాలు విడిచాడు. సీత జాడ తెలిసినందుకు వానరులకు అమితానందం కలిగింది.

జాంబవంతుడు మిగిలిన వానరుల పక్షాన సంపాతితో, సీతాపహరణం గురించి ఇంకా వివరంగా చెప్పమన్నాడు. దానికి సంపాతి యిలా చెప్పాడు:

"నేను రెక్కలు కాలి, ఈ వింధ్య పర్వతం మీద పడిపోయినది మొదలు ఇక్కడే ఉండి. వృద్ధుణ్ణి అయిపోయాను గద. అందుచేత నా కొడుకు సుపార్శ్వుడు నాకు వేళకు ఇంత తిండి తెచ్చిపెడుతూ ఉంటాడు. ఒకనాడు వాడు సూర్యాస్తమయం అయిన దాకా రాకపోగా, ఆలస్యంగా వచ్చిన వాడు ఆహారం తీసుకు రాకుండా వచ్చాడు. అసలే ముసలివాణ్ణి, దాని పైన ఆకలితో ఉండటం చేత, వాడి మీద మండిపడ్డాను. అప్పుడు వాడు నన్ను శాంతపరుస్తూ, జరిగిన సంగతి చెప్పాడు. వాడు సరి అయిన వేళకే మహేంద్ర పర్వతం మీదికి ఆహారం కోసం వెళ్లాడట. అప్పుడు వాడికి నల్లటి వాడొకడు ధగధగ మెరిసే స్త్రీని తీసుకుపోతూ కనిపించాడు. మా వాడు వాళ్ళనే ఆహారంగా పట్టుకుందామని వాళ్ళకు అడ్డం వెళ్ళాడు. ఆ నల్లనివాడు సుపార్శ్వుణ్ణి మర్యాదగా, అడ్డం తొలగమన్నాడు. ఆ మనిషి మర్యాదను పాటించి సుపార్శ్వుడు వాళ్ళకు దారి ఇచ్చాడు. తరవాత ఆ మనిషి అతివేగంగా వెళ్లిపోయాడట. తరవాత

సుపార్శ్వుడు ఆకాశభూతాలను అడగగా ఆ నల్లటివాడు రాకసరాజైన రావణుడనీ, రామలక్ష్మణులను ఎలుగెత్తి పిలిచే ఆ స్త్రీ సీత అనీ, రావణుడు ఆమెను ఎత్తుకుపోతున్నాడనీ తెలిసింది. ఇదే వాడు ఆలస్యంగా రావటానికి కారణం.''

తరవాత వానరులు సంపాతిని తిరిగి పర్వతం మీదికి చేర్చారు. అక్కడ వానరప్రముఖులకు తన పాత అనుభవాలను సంపాతి ఇలా చెప్పాడు:

''నేను రెక్కలు కాలి ఈ వింధ్య పర్వతం మీద పడినప్పుడు ఇక్కడ ఒక ఆశ్రమం ఉండేది. అందులో నిశాకరుడు అనే గొప్ప మహర్షి ఉండేవాడు. ఇదంతా ఎనిమిదివేల ఏళ్ళనాటి సంగతి. పర్వతం మీద పడిపోయిన నేను అతికష్టం మీద మిట్టపల్లాలను దాటుకుంటూ ఆ మహర్షి ఆశ్రమానికి వచ్చాను. అక్కడ ఒక చెట్టు కింద మహర్షి దర్శనం కోసం వేచి ఉన్నాను. అప్పుడు నాకొక వింత కనిపించింది. దక్షిణదిశ నుంచి ఆయన స్నానం చేసి వస్తూంటే, ఆయన వెంట ఎలుగుబంట్లూ, చమరీమృగాలూ, పులులూ, సింహాలూ, ఏనుగులూ, సర్పాలూ రావటం నాకు కనబడింది. ఆయన ఆశ్రమంలోకి వెళ్ళగా[illegible] అవి అన్నీ వెళ్ళిపోయాయి. లోపలికి పోతూ



నన్ను చూసిన నిశాకరమహర్షి, కొంతసేపటికి తిరిగి వచ్చి, 'గద్దలకు రాజులైన ఇద్దరు అన్నదమ్ములను నేను ఎరుగుదును. అందులో నువు పెద్ద వాడైన సంపాతివి కాదూ? జటాయువు నీ తమ్ముడు కదా? మీరిద్దరూ అప్పుడప్పుడూ మనుష్యరూపాలలో నాకు కనబడి నమస్కరించే వాళ్ళు. నీ కేమైనా జబ్బుగాని చేసిందా? నీ రెక్కలు ఎందుకు పడిపోయాయి? నిన్ను ఎవరైనా శిక్షించారా?' అని అడిగాడు.

''నేను ఆ మహర్షికి జరిగినదంతా చెప్పాను. కైలాసపర్వతం మీద ఋషుల దగ్గిర నేనూ, నా తమ్ముడూ శపథం చేసి,

సూర్యుడు అస్తమించే లోపల సూర్యుడి వెనకాల ఎగిరిపోతామన్నాం. మేం చాలా ఎత్తుకు ఎగిరాం. భూమి మీద ఉన్న నగ రాలన్నీ బండిచక్రాల ప్రమాణంలో కని పించాయి. దారిలో మాకు వేదఘోష విని పించింది; ఎర్రని చీరలుధరించి పాటలు పాడే స్త్రీలు కనిపించారు. ఇంకా ఎత్తుకు ఎగిరాం. అడవులు పచ్చిక బీళ్ళలాగానూ, పర్వతాలు చిన్న రాళ్ళలాగానూ, నదులు దారపు పోగులలాగానూ కనిపించాయి. మాకు ఆయాసంతో బాటు భయమూ, మతిచలించటమూ, దృష్టి చెదరటమూ, మూర్ఛరావటమూ లాటి లక్షణాలు కూడా కలిగాయి. దిక్కులు తెలియరాలేదు. ఆ ఎత్తున సూర్యుడూ, భూమీ ఒకే ప్రమాణంలో కనిపించారు.

"అంతలో జటాయువు స్పృహ తప్పి నేలమీద పడసాగాడు. వెంటనే నేను కూడా దిగివస్తూ, జటాయువును నా రెక్క లతో కప్పాను. ఆ సమయంలో జటా యువు సూర్యుడి వేడి నుంచి తప్పించు కున్నాడు గాని, నా రెక్కలు కాలి పోయాయి. జటాయువు జనస్థానంలో పడ్డాడనుకుంటాను. ఇదంతా నిశాకర మహర్షికి చెప్పి, నాకు జీవించాలని లేదనీ పర్వతం మీది నుంచి దూకి చచ్చిపోతా ననీ అన్నాను.

"ఆ మహర్షి నాకు రానున్నది చెప్పాడు. మీరు సీతను వెతుకుతూ వస్తారనీ, నేను మీకు సహాయం చేస్తాననీ, తరవాత నాకు రెక్కలు వస్తాయనీ, నన్ను ఇక్కడే ఉండమనీ ఆయన అన్నాడు."

ఇలా అంటుండగానే సంపాతికి రెక్కలు రావటం వానరులకు కన బడింది. ఆ రెక్కల ఈకలు ఎర్రగా ఉన్నాయి. సంపాతి పరమానందభరి తుడై, "నిశాకర[illegible]ర్షి చెప్పినట్టే నాకు మళ్ళీ రెక్కలు వచ్చాయి. బలం తిరిగి వచ్చింది. దీన్ని బట్టి మీ ప్రయత్నం తప్పక విజయవంతమవుతుంది. నేను నా రెక్కల బలం చూసుకుంటాను," అంటూ ఆకాశంలోకి ఎగిరిపోయాడు.






సర్వథా సుకరం మిత్రం,
దుష్కరం పరిపాలనం;
అనిత్యత్వాచ్చ చిత్తానాం
ప్రీతి రల్పేపి భిద్యతే. 1

[మిత్రుణ్ణి సంపాదించటం తేలిక, నిలబెట్టుకోవటం కష్టం. మనస్సు నిలకడ లేని కారణం చేత స్నేహం స్వల్పకారణాలవల్ల కూడా [illegible]తుంది.]

మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం
సత్యధర్మపరాయణం,
తద్వ్యయం తు పరిత్యక్తం
న తు ధర్మే వ్యవస్థితం. 2

[సత్యం మీదా, ధర్మం మీదా ఆధారపడి ఏర్పడిన మిత్రుడు అర్థం [ధనం] కన్న గొప్ప వాడు. అలాటి మిత్రుణ్ణి వదిలినవాడు ధర్మాన్ని నిలుపుకోలేడు.]

పరోక్షే కార్యహంతారం,
ప్రత్యక్షే ప్రియవాదినం
వర్జయే త్తాదృశం మిత్రం
విషకుంభ పయోముఖమ్. 3

[చాటుగా పనులు పాడు చేస్తూ, ఎదురుగా మంచిగా మాట్లాడే మిత్రుణ్ణి విసర్జించాలి. వాడు పైన పాలూ, అడుగున విషమూ గల కుండ.]

మిత్రుడు

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

యుద్ధం చేయనున్నవి

పంపినవారు :
డి. కాశీప్రసాదరావు

Photo by Anant Desai



పాలిటెక్నిక్,
శ్రీకాకుళం.

వృద్ధికి రానున్నవి

బహుమతి
పొందిన వ్యాఖ్య

VIII IX

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు జూన్ 20వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
పాముల ఆట

మూడవ అట్ట:
పాములు నీట


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'






మా అందరకూ
ఇష్టమయిన
పత్రిక

# చందమామ




మీకూ అంతేగా!

చందమామ పురుషులు, స్త్రీలు, పిల్లలు అందరూ చదువుతారు.. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, ఒరియా, పంజాబీ—11 భాషలలో ఇది వెలువడుతున్నది. ఈ పిల్లల పత్రికలో అపురూపమయిన కథలుంటాయి. ప్రతి హృదయాన్నీ సంతోషపరుస్తాయి.

చందమామ పిల్లల మాసపత్రిక. ఇది చదివితే
పిన్నల ఉత్సాహం పెద్దలకు కలుగుతుంది.
పెద్దల విజ్ఞానం పిన్నలకు అబ్బుతుంది.



చందా వివరములకు: డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, మద్రాసు -600026.



ఆదర్శమూర్తియైన భర్త పండంటి బిడ్డలు నిండు నెలయేరులా పొంగిపోయే
జీవితాన్ని ఆమె ఎందుకు బలి చేసుకుంది?
ముప్పలనేని శేషగిరిరావు సమర్పించు
రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్
రంగనాయకమ్మ నవల
బలిపీఠం
ఈస్ట్‌మన్ కలర్
సోల్ డిస్ట్రిబ్యూటర్స్
అనిల్ ప్రభాస్
ఎంటర్ ప్రైజెస్
నిర్మాత
వై. సునీల్ చౌదరి
మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
దాసరి నారాయణరావు
నవయుగ
VEEKAY
సంగీతం చక్రవర్తి
కెమెరా
ఎడిటింగ్ కె. సత్యం
ఆర్ట్ కళాధర్
నిర్వహణ కొసరాజు సుబ్బారావు


XIII

పుష్టికరమైనది, ఎక్కువ మాంస-కృత్తులువున్న మోడర్న్ పీనట్ బట్టర్‌ను అనేక మధురమైన పద్ధతుల్లో వుపయోగించవచ్చు. స్యాండ్‌విచ్‌లు, ప్యాన్ కేక్‌లు, దోసెలు, పరాఠాల మీద దాన్ని రాసి, తినండి. సూప్‌లు, సేవరీలు, కేక్‌లు మరియు పులావులకు దాన్ని చేర్చండి.




**పీనట్ బట్టర్ పరాఠాలు**

పరాఠాలు చేసేటప్పుడు 20% (పిండి బరువులో అయిదవవంతు) మోడర్న్ పీనట్ బట్టర్‌ను చేర్చండి. లేదా, పరాఠాలను మామూలుగా చెయ్యండి, అప్పుడు బంగాళాదుంప పరాఠాలకు బంగాళా దుంపలను కూరినట్లు మోడర్న్ పీనట్ బట్టర్‌ను కూరండి. అయితే, మోడర్న్ పీనట్ బట్టర్ వండేందుకు వుపయోగించే పదార్థం కాదని మాత్రం గుర్తుంచుకోండి.

మోడర్న్ బేకరీస్ (ఇండియా) లిమిటెడ్.
(భారత ప్రభుత్వ వ్యవస్థ),
25బి, లోకల్ షాపింగ్ సెంటర్,
వసంత్ విహార్, న్యూ ఢిల్లీ 110057.

# మమ్మీ! మమ్మీ! మోడర్న్ పీనట్ బట్టర్ పరాఠాలు



U-MBI-6 TEL

xiv

నవచిత్ర ఎంటర్‌ప్రైజెస్

# రక్తసంబంధాలు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: యం. మల్లికార్జునరావు

శ్రీఫిలింస్

VEEKAY







## సమయోచిత సందర్భాన్ని చెప్పండి
## రూ 50,000 లు విలువచేసే
## బహుమతులు గెలవండి

# ప్యారీవారి "సమయోచిత సందర్భాన్ని చెప్పండి" పోటీలో పాల్గొనండి

**2** మొదటి బహుమానాలు — మీ కిష్టమువచ్చిన ఆభరణాలసమితి ఒక్కొక్కటి — విలువ రూ. **10,000/-**

**2** రెండవ బహుమానాలు రెఫ్రిజిరేటరుగాని వంట సరంజామాగాని ఒక్కొక్కటి — విలువ రూ. **5,000/-**

**50** కన్సోలేషన్ బహుమానాలు — కాంచీపురము చీరలు ఒక్కొక్కటి — విలువ రూ. **400/-**

మీకు దగ్గరలో నున్న డీలరువద్ద పూర్తి వివరములతో గల ఎంట్రీ ఫారములు లభిస్తాయి.

Parry's
Parry's "Pick-The...

6 రంగులలో లభిస్తాయి గ్రా 450లు
వెల రూ 12/-లు మాత్రమే.

ప్యారీస్
కన్ఫెక్షనరీ లిమిటెడ్
మద్రాసు.

**త్వరపడండి!**
**పోటీ ముగింపు తేది**
**15 జూన్ 1975**

SAA/PRS/1665



